శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

## Journal of the Telugu Academy

KAKINADA





దేశభాషలందు తెలుగు లెస్స


సంపుటము ౫౧ శుభకృత్తు-చైత్ర- సంచికలు ౧-౨

Vol 51 ఆషాఢములు 1962-'63 Parts I & II

# ఆంధ్రసాహిత్య పరిషత్తు

స్థాపకులు:

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు:

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు

ఉద్ధారకులు:

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,
(జమీందారు, ఉయ్యూరు ఎస్టేటు,)



# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

**Journal of the Telugu Academy**
**KAKINADA**

సంవత్సరము చందా రు 3-0-0

సంపుటము ౫౧ శుభకృత్తు చైత్ర-వైశాఖ సంచికలు ౧-౨
Vol 51 జ్యేష్ఠ ఆషాఢములు 1962-63 Parts I & II



## వి ష య సూ చి క

# స్వ వి ష య ము

ఈ శుభకృత్తు చైత్రమాసముతో నీ పరిషత్పత్త్రికకు నేఁబదియేండ్లు గడచి యేఁబది యొకటవ వత్సరము ప్రారంభమయినది. పరిషత్సంస్థ, తదనుబంధముగ బయలుదేరిన యీ పత్త్రికయు గట్టి పునాదులపై నిలిచియున్న కారణమున నింతవఱకు నిలిచుకొని యున్నది. ఆంధ్రభాషలో రచన సాగించువారిలోఁ బెక్కు రీనాఁడు వ్యావహారికభాష యనఁబడు తీరుననే రచన సాగించుచున్నారు. దీనిమూలమున గ్రాంథిక భాషా విషయమున నిప్పటి తరమువారి కనాదర మధికమగుచున్నది. ప్రాచీన ప్రబంధములను బాగుగఁ జదివి వానిలోని విషయము నవగతముఁజేసికొని, మన భాషకుఁగల గొప్పతనమును దామూహించుకొని, యితరులకందిచ్చు నుత్సాహము చాలమందిలోఁ గానవచ్చుటలేదు. దీనికిఁ గారణము, ఈ నాఁటివారిలో పెక్కురు తెలుఁగుచదువరులకు సంస్కృతభాషాపరిజ్ఞానము తక్కువగుటయే. సరిపడిన సంస్కృత భాషాపరిజ్ఞానము లేనిదే, తెలుఁగుసాహిత్యములో నిక్షిప్తమైయున్న మధుర భావసామగ్రి నారలించి యానందించెడి యవకాశము జతపడదు. సంస్కృతభాషకు సరియయిన యాదరములేక దాని నభ్యసించువారి సంఖ్య నాఁటికి నాఁటికిఁ దరిగిపోవుచున్నది. సరియయిన సంస్కృత భాషాపరిజ్ఞానము లేకయే కొందఱు విమర్శన కుద్యుక్తులగుచు, ప్రాచీన కవి ప్రయోగములను తమ యిచ్ఛవచ్చినట్లు సంస్కరింపఁ జూచుచున్నారు. ప్రతి విషయమునను నేఁటి వ్రాఁతలలో స్వేచ్ఛాచారమే గానవచ్చుచున్నది. చారిత్ర కాంశముల చర్చలు కూడ నా తీరుననే సాగుచున్నవి. ఆంధ్ర సాహిత్యపరిష త్కార్యాలయములో ప్రాచీనమైన సంస్కృతాంధ్ర గ్రంథరాశి యమూల్యమైనది గలదు. దాని నీనడుమ ఉస్మానియా విశ్వవిద్యాలయములో పరిశోధనము చేయు విద్యార్థులు కొంతవఱకు వినియోగించుకొనుచున్నారు. ఆంధ్ర సారస్వత రంగములో నేశాఖలో విమర్శనముచేయ నుద్యుక్తులైనవారైనను, కావలసిన గ్రంథసామగ్రిని పరిషత్తులో నుండినదానిని వినియోగించుకొని, ప్రామాణికమైన విమర్శనము సాగించిన దానివలన భాష కెంతేని మేలు కలుగఁ గలదని యాశ.

ఇట్లు,

సంపాదకుఁడు.

[సూచన :— 71వ పుట 12-15 పంక్తులలో త్రిభువనమల్లుని అనుదానికి బదులుగ త్రైలోక్యమల్లుని అని చదువుకొనవలెను]

# ఆంధ్రసాహిత్య పరిషదధ్యక్షులకు అభినందనము.

(కన్నడ సాహిత్య పరిషత్పత్రిక (Vol. 47 No 1) జూన్ 1963 సంచికయందలి సంపాదకీయమున కనువాదము)

"కన్నడ సాహిత్యపరిషత్తునకు సోదర సంస్థయైన ఆంధ్ర సాహిత్య పరిషత్తునకు విఖ్యాత విద్వాంసులు, విమర్శన విచక్షణులు నయిన శ్రీ బండారు తమ్మయ్యగారు తాత్కాలికాధ్యక్షులుగా నున్నారని వినుటకు మా కమితానందమయినది. శ్రీయుతులు తెలుఁగు, సంస్కృతభాషలందుఁ బ్రవీణులు. ఇంగ్లీషు, కన్నడ భాషలను నెఱిఁగినవారు. విమర్శకాగ్రేసర, ఐతిహాసిక సమ్రాట్ బిరుదములను విద్వ ద్దాస్థానములనుండి పడసినవారు. జ్ఞానవృద్ధులువయోవృద్ధులు, శైవధర్మ మార్గైకనిరతులు. దైవభక్తి పరాయణులు. ఇట్టి పండితోత్తములు ఆంధ్రసాహిత్యపరిష దధ్యక్షులుగ నుండుట సర్వవిధముల సమంజస ముగా నున్నది.

మాన్యశ్రీ బండారు తమ్మయ్యగారు పాల్కురి సోమనాథుని బసవపురాణమును బరిశోధించి 1952 సంవత్సరమున విద్వత్తతోఁ గూడిన 156 పుటల ప్రస్తావన రచించి ప్రకటించిరి. 1948 సంవత్సర మున మహాకవి పాల్కురికి సోమనాథుని గుఱించి "సోమనాథకవి" యను విస్తృతగ్రంథము (335 పుటలు) రచించి ప్రకటించిరి. ఈ గ్రంథ మొక ప్రసిద్ధకవి ప్రశస్తికి సంబంధించినది. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, భారతి, విభూతి, శరణసాహిత్య మన్నగు కొన్ని శ్రేష్ఠ పత్రికలకు విచారపరిపూర్ణములగు లేఖనములను వ్రాసియుండిరి. బసవకల్యాణమున సమావేశమయిన అఖిల భారత వీరశైవ మహాసభ చేతను, శ్రీ జగద్గురు శ్రీశైల సంస్థానాధీశ్వరులవలనను సమ్మానితు లయినవారు. అన్నిటికన్న మిన్నగా వీరు కన్నడ భాషాభిమానులయి కెరెయపద్మరసు రచించిన దీక్షాబోధయను గ్రంథమునకుఁ బిడుపర్తి

బసవకవి రచించిన వీరశైవ దీక్షాబోధయను గ్రంథమును బరిశోధించి ప్రకటింప సంసిద్ధులయి యున్నవారు. ఇంతటి విద్వాంసులు ఆంధ్ర సాహిత్య పరిషత్తున కధ్యక్షులుగానుండుట మాకు మిక్కిలి సంతోష దాయకముగ నున్నది. విద్యానిధులయిన శ్రీ బండారు తమ్మయ్యగారికి కన్నడ సాహిత్య పరిషత్పక్షమున సుస్వాగత మొసంగుచున్నారము.

వీరి కాలమున ఆంధ్రసాహిత్య పరిషత్తు ఇంకను హెచ్చుగఁ గీర్తి గౌరవములను బడయుతమని, కర్ణాటాంధ్ర భాషల బాంధవ్య మధిక మగుఁ గాక యని మే మభిలషించుచున్నాము."

---

# తిక్కన నిర్వచనోత్తర రామాయణము.

(శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, M.A. P.H.D. హైదరాబాదు.)

కవిబ్రహ్మ తిక్కన ప్రథమసృష్టి నిర్వచనోత్తర రామాయణము. అతనితాత భాస్కరమంత్రి పూర్వరామాయణమును రచించెననియు, నదియే నిజమైన భాస్కర రామాయణ మనియు, దానిని బూర్తి గావించుటకే తిక్కన యుత్తర రామాయణమును రచించెననియు ప్రతీతి. దీనికి నిర్వచనోత్తర రామాయణమున నతఁడు వ్రాసిన

సార కవితాభిరాము గుంటూరి విభుని
మంత్రి భాస్కరు మత్పితామహునిఁ దలఁచి
నైన మన్ననగుమెయి లోక మాదరించు
వేఱ నాకృతి ణములు వేయునేల ౧-12

అను పద్య మాధారము. ఇందు మంత్రి భాస్కరుఁడు సారకవితాభిరాముఁ డనియే తెలియుచున్నది కాని రామాయణమును రచించె ననుటకు సూచన లేమియు లేవు. కాని తిక్కన పూర్వ రామాయణ మును విడిచి కరుణమయమైన యుత్తరభాగ మొక్కటే యేల వ్రాసి యుండెనని యాలోచించినచో, పూర్వ రామాయణ మంతకు ముందే యతని తాత రచించియుండెనేమో యను ననుమాన ముదయింపక మానదు. ఆ యనుమానమును పై పద్యము బలపఱచును. ఆంధ్ర కవి తరంగిణిలో కీ శే. చాగంటి శేషయ్యగారు కావించిన వాద మీ యనుమానమునకు మఱింత బలము చేకూర్చుచున్నది. ఇందలి సత్యా సత్యములు భావి పరిశోధనల వలనఁగాని తేల్చుటకు వీలులేదు.

తిక్కన తన నిర్వచనోత్తర రామాయణమును నెల్లూరి విభుఁ డును, దనకు ప్రభువునైన మనుమసిద్ధి భూపాలుని కంకిత మొనర్చెను. ఆ రాజొకనాఁడు తిక్కనను రాఁబనిచి "ఏ నిన్ను మామ యనియెదు దీనికిఁ దగనిమ్ము భారతీ కన్యక, నాకీ నర్హుఁడవగుదు" వని తన

యభిలాషను వెల్లడించెను. తిక్కన యా రాజు గుణగణములెంచి, యాతని పలుకుల యౌచిత్యమున కలరి, యట్లు చేయుటకు సము త్సుకుఁ డయ్యెను. మనుమసిద్ధి కీర్తి సౌధమునకు మూలస్తంభమని చెప్పఁదగిన కావ్య ముదయించెను.

నిర్వచనోత్తర రామాయణ కాలమునాఁటికి తిక్కన ప్రౌఢుఁడైన మహాకవి యయ్యు నహంకార శూన్యుఁడైన కర్మయోగి కాఁడు. అతఁడు మంత్రిపదవి నిర్వహించుచు, నిగ్రహానుగ్రహములు ప్రదర్శించుచు, లౌకిక జీవితమునకే దగ్గఱగా నుండెను. అందుచేతనే అతఁడందు తన్నుఁగూర్చి "అమలోదాత్త మనీష నేనుభయ కావ్య ప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుఁడం గళావిదుఁడ" నిత్యాదిగా చెప్పుకొని సర్వకవి సామాన్యమైన యించుక యహంకృతిని బ్రకటించెను. అప్పటి కింకను అతనికి హరిహరాద్వైత భావము కుదురలేదు. అతఁడు మహేశ్వరాంఘ్రి కమలధ్యానైక శీలుఁడై తరుణేందుశేఖరుని వంకకే కొంచెము మొగ్గు చూపుచుండెను. ఇప్పటి యతని మనః ప్రవృత్తి ననహంకార నిమగ్నమైన భావన కాకరమై, హరిహరనాథుల నేకమూర్తిగా ధ్యానించుచు, 'నా నేర్చినభంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికని చెప్పించిన భారతమునాఁటి యతని స్థితితోఁ బోల్చి చూచినచో నహంకార పరిమార్జకమైన యుత్తమాధ్యాత్మిక మార్గమున నాతఁ డెంతవఱకు పురోగమించెనో తెలియవచ్చును.

నిర్వచనోత్తర రామాయణము తన తొలిరచన యగుటచే తిక్కన యందు స్వీయకవితామార్గ నిరూపకములైన కొన్ని నియమములు కావించికొనెను. ఇందు కొన్ని భావికవి మార్గదర్శకములుగను, కొన్ని నన్నెచోడాది పూర్వకవి మార్గనిరాసకములుగను స్ఫురించుచున్నవి. పలుకులపొందిక విడిచి, ప్రాఁతవడ్డ మాటలతో రసభంగ మొనర్చుచు కావించు రచన, ప్రాయు కవులకుమాత్రము మెచ్చు

కలిగించినను వరుల హృదయముల నలరింపఁజాలదనియు, కవులర్థాను గుణములైన పదములనే గ్రహింపవలయుననియు, యతిప్రాస లుచిత రీతి నిలుపక పులివిపుచ్చరాదనియు, సంస్కృత శబ్దములకు తెలుఁగు విశేషణములను వాడునపుడు లింగవచన భేదముకలిగించుట యుచితము కాదనియు, వ్యాకరణయుక్తములైనను సంస్కృత పదములను (సుప్తిఙంతాదులను) తెలుఁగున ప్రయోగించుట జాత్యముకాదనియు, ప్రాశ్యసరూపమను భావముతో ప్రాసాక్షరములందు వేఱగు నక్షరముల ఁజొన్పరాదనియు, కాహళసంధించినప్పుడు వినిపించు ధ్వనిఖండములవలె నలఁతియలంతితునియలుగ పదములు వాడవలెననియు నతఁడు కావించుకొన్న నియమములు. నన్నెచోడాది శైవకవులలో నిందలి కొన్ని నియమములకు వ్యతిక్రమము కనిపించును. భారతమునాఁటికి తిక్కనయే యీ నియమములం దొండు రెండింటిని సడలించినట్లు కనిపించును.

సంస్కృతమున తొల్లింటి శ్రవ్యకావ్యములన్నియు నాద్యంత శ్లోకమయములే. తరువాత నందు వచనకావ్యములు, చంపూకావ్యములు బయలుదేఱినవి. తిక్కన యుత్తర రామాయణ రచనమున తొల్లింటి సంస్కృత మహాకవుల మార్గము ననుసరించెను. అదియుఁ గాక నన్నయ భారతమును చంపువుగనే యారంభించినను ఆరోజులలో పద్యమున కున్నంత గౌరవము గద్యమునకున్నట్లు కనుపింపదు. దీనికి సంస్కృతమున గద్యమయముగానున్న దశకుమార చరిత్రమునకు కేతన పద్యగద్యమయాంధ్రీకరణము వెలయించుట యొక నిదర్శనము. "వాక్యసాంగత్యము చేయుచోనైన గద్యముతోడుగఁ జెప్పిపెట్ట"నని తిక్కన చేసికొన్న నియమములలో నొకటి. ప్రౌఢులైన వారు వచనము లేకయు వర్ణనలు రచింపవచ్చుననియు, కథలను పద్యములందే చెప్పుటార్యసమ్మత్య మగుననియు, కథార్థము లలిత హృద్యపద్యము

లందే ఘటితపూర్వాపరమై యమరవలెననియు నతని భావము. అతని తాత పూర్వరామాయణమును వ్రాయుట నిజమైనచో దాని నతఁడు నిర్వచనముగనే వ్రాసెనేమో మనకుఁ దెలియదు. ఆ మార్గము నితఁడు కొనసాగించి యుండును. కాని భారతమునాఁటి కభిప్రాయము మార్చుకొని నన్నయవలె చంపూమార్గమునే యవలంబించెను. ద్విపదశతక కవులను విడిచినచో పూర్వకవులలో నిర్వచన కావ్యము వ్రాసినవాఁడు తిక్కన యొక్కఁడే.

నిర్వచనోత్తర రామాయణము వ్రాయునాఁటికే తిక్కన యుభయకవి మిత్రుఁడు. అమలోదాత్తమనీషీత్యాది పద్యమున 'నేనుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుండ' నని యతఁడు చెప్పుకొని యుండెను. ఉభయకావ్యములనఁగా దేశిమార్గ కావ్యములనికాని ఆంధ్ర సంస్కృత కావ్యములనికాని యర్థము చేసికొనవలయును. భారతమందలి రచన చూచినచో తిక్కన దేశిమార్గ కవుల కిరువురికిని మిత్రుఁడుగనే గనిపించును. ఇంక నతని సంస్కృత కవితాప్రౌఢిని తెలిసికొనుట కతని శ్లోకములు రెండుమాత్రమే మనకు లభించుచున్నవి. అందొకటి నిర్వచనోత్తర రామాయణారంభమందలి 'శ్రీరాస్త్రా' మనునది. నన్నయ భారతాంధ్రీకరణమును సంస్కృత శ్లోకముతో నారంభించుటచే తిక్కనయు తన తొలిరచనలో నా పద్ధతినే యవలంబించి యుండును. తరువాత విరాటపర్వమును మాత్ర మతఁడు తెలుఁగు పద్యముతోనే యారంభించెను. ఇంక రెండవది హరిహరనాథుని గూర్చి యతఁడు చెప్పిన 'కిమస్థిమాలా' మిత్యాదిశ్లోకము. గంగాదేవి కంపరాయవిజయ కావ్యమున పూర్వకవి స్తోత్రములో నొక తిక్కననుకూడ చేర్చెనఁట. ఆ తిక్కన మన యుభయకవి మిత్రుఁడేయైనచో నితఁడుకూడ సంస్కృతమున రచన కావించెనని భావించుట కవకాశముండును. ఆమెపై రెండు

శ్లోకములను మాత్రము పురస్కరించుకొని తిక్కనను పూర్వకవి స్తుతిలో చేర్చియుండడు. తెలుగుసీమ యందలి మేటి కవిసత్తముఁడు కదా యని యతఁడు సంస్కృతమున నేవియు కావ్యములు వ్రాయక పోయినను అభిమానముతో నతని నామమును పూర్వకవిస్తుతిలో చేర్చి యుండవచ్చును. మొత్తముమీఁద తిక్కన రచించిన సంస్కృత కావ్యము లేవియు లభించుటలేదు. అతఁడు సంస్కృతమునఁ గూడ నుత్తమకవిత చెప్పఁగలవాఁ డనుటలో మాత్రము సందేహము లేదు. "కిమిస్థిసూలా" యొక్కటి చాలు నాతని సంస్కృతకవితా ప్రాగల్భ్యమును చాటుటకు.

రామాయణమందలి సప్తమకాండ ముత్తరకాండము. దీని కర్తృత్వ విషయమున భిన్నాభిప్రాయము లున్నను ఇదియు వాల్మీకి కృతముగనే పలువురిచే భావింపఁబడుచున్నది. తిక్కన దీనినే యనుసరించి నిర్వచనోత్తర రామాయణమును రచించెను. భారతమువలెనే యిదియు యథామూలానువాదము కాదు. కథనుమాత్ర మనుసరించుచు నెడ నెడ మార్పుచేర్పు లొనరించుచు నతఁ డీ కావ్యమును రచించెను. అతఁ డిందు పెక్కు భాగములను సంక్షేపించెను. కొన్నిటిని తొలగించెను. అందు శ్రీరామ నిర్యాణగాథ ముఖ్యమైనది. తరువాత జయంతి రామభట్టసుకవి తిక్కన నిర్వచనోత్తర రామాయణమును పూర్తిచేయుటకో యన నా కథనుమాత్రమే గ్రహించి యేకాశ్వాసముగా రచించెను. తిక్కన పెంచిన భాగములు పెక్కు వర్ణనములు. ఇవి యష్టమాశ్వాసమున కనిపించును. ఈతఁ డుత్తర రామాయణము నందలి శ్లోకములను యథాతథముగా ననువదించిన పట్లుకూడఁ గొన్ని కలవు. అసలు పూర్వకవులు ముఖ్యముగా భారతకవులు - అనువాదమునకే గడంగినను ప్రతిపదానువాదమునకై, పూనిన జాడ యెచ్చటను గానరాదు. మూలకథాతత్త్వములకు భంగము కలుగకుండ, తెలుఁగు

భాషా జాతీయముల కనుగుణముగ సంస్కృత గ్రంథములను తెలుఁగు వారి కందీయవలెననియే వారి యుద్దేశము. ఆ పద్ధతియే నిర్వచ నోత్తర రామాయణమునఁ గూడ కనిపించును.

నిర్వచనోత్తర రామాయణమున నాశీస్సు,కవిస్తుతి కవినిందా నంతరము కృతినాయక వంశావతార వర్ణనము కావింపఁబడినది. ఇట్టి వర్ణనమున్న మొట్టమొదటి తెలుఁగు కావ్యము నన్నెచోడుని కుమార సంభవము. రెండవదిది. ఇందు షష్ఠ్యంతములను పేర కొన్ని పద్యములు లేవుకాని వంశవర్ణనానంతరము కథారంభమునకుఁ బూర్వము "అమ్మను మనృపతి కభ్యుదయముగ నేఁ జెప్పఁబూనినట్టి కథకు" నని షష్ఠీవిభ క్త్యంతమైన కృతిపతి నామము పేర్కొనఁబడినది. ఇందలి ఆశ్వా సాద్యంత పద్యములు పెక్కు ప్రథమావిభక్త్యంతములుగా నున్నవి. ద్వితీయాశ్వాసాంతమునను తృతీయాస్వాదినిగల పద్యములు ద్వితీయా విభక్త్యంతములుగను, చతుర్థాశ్వాసాంతమునను పంచమాశ్వాసాదిని గల పద్యములు తృతీయా విభక్త్యంతములుగను, పంచమాశ్వా సాంతమునను షష్ఠాశ్వాసారంభమునను గల పదములు షష్ఠీవిభక్త్యం తములుగను గనవచ్చుచున్నవి. ఈ విధాన ముదాహరణ కావ్యపద్ధ తిని సూచించుచున్నది. ఈ ఆశ్వాసాద్యంతములఁ గనవచ్చు మఱొక విశేష మేమన ఆశ్వాసారంభములందలి పద్యములు తత్పూర్వాశ్వా సాంత పద్యములందలి విభక్తితోనే కూడియుండుట. మఱియు నాశ్వాసారంభ పద్యమందలి విభక్తియే తరువాతవచ్చు కథాసంబంధి పద్యమందలి నామమునందును కనుపించుచుండును. "మన్మ భూమీ శుఁడాగిన" "శ్రీరామచంద్రుఁ డెల్లు" మొద. ఈ విధానమువలన నాశ్వాసారంభ పద్యమునందలి విశేషణములు తెరువాతి పద్యమున చెప్పఁబడిన వ్యక్తికిఁ గూడ సంబంధించినట్లును, కృతినాయక కథా నాయకుల కభేదము చెప్పఁబడినట్లును తోఁచును.

నిర్వచనోత్తర రామాయణమునందలి కథ అయోధ్యావర్ణన
పూర్వరామాయణ కథా సంగ్రహములతో నారంభించుచున్నది.
తిక్కన తాను చెప్పఁదలఁచుకొన్నది ఉత్తర రామాయణ కథమాత్రమే
యగుటచే కావ్యారంభమున పూర్వకథా విషయములు సంగ్రహ
ముగాఁ జెప్పి కావ్యమున కొక సమగ్రత కలిగించినాఁడు. ఇది భవ
భూతి ఉత్తర రామచరిత్ర నాటకమున చిత్రపదర్శనమువలె పూర్వో
త్తర రామాయణకథా సందర్భముల నతుకుచున్నది. ఈ పూర్వ
రామాయణ సంగ్రహ కథనము తిక్కన తాత రామాయణమును
వ్రాసియుండు నేమోయను సందేహమును తొలగించుచున్నది. ఏల
యన దాని ఉత్తరభాగముగా తిక్కన దీనిని వ్రాసినచో నిందు
పూర్వరామాయణ కథాస్మరణ చేయవలసిన యవసరము లేదు.

నిర్వచనోత్తర రామాయణము నందలి కథావస్తువునుబట్టి
రెండు ముఖ్యభాగములుగా విభజింపవచ్చును. మొదటి యేడాశ్వాస
ములలో రావణాదులయొక్కయు, వారి పూర్వులయొక్కయు చరి
త్రలు, పరాక్రమాదులు వర్ణింపఁబడినవి. రెండవభాగమున సీతా
పరిత్యాగము, లవణాసురవధ, రామాశ్వమేధము మున్నగు విషయ
ములు చెప్పఁబడినవి. నిజమునకు రామాయణమున రావణాదుల
యొక్కయు తత్పూర్వులయొక్కయు జననాది వృత్తాంతములను వివ
రముగాఁ చెప్పవలసిన యావశ్యకము లేదు. చెప్పినను పూర్వరామా
యణముననే తత్ప్రసంగము వచ్చినప్పుడు సంగ్రహముగా చెప్పియుండ
వలసినది. వాల్మీకి యట్లు చెప్పలేదు. అందుచే నీ యుత్తరకాండమున
దాని కేదోవిధముగా ప్రసంగము కల్పింపఁబడినది. రావణవధానంత
రము రాముఁడు పట్టాభిషిక్తుఁడై రాజ్యము పాలించుచుండ నగస్త్యాది
మును లాతని నభినందించుటకై యరుగుదెంచి "పంక్తిముఖు నాతని
తమ్మునిఁ గుంభకర్ణునిం, దనయుని మేఘనాదుని, నుదగ్రబలాఢ్యులు

గాఁగడంగి పేర్కొని" వారిని యుద్ధమున సంహరింపఁగలిగిన రామ లక్ష్మణాదుల పరాక్రమములనగ్గించిరి. అంత రాముఁడు కడిఁదిమగ లైన యా రాక్షస వీరుల తపశ్చర్యాశౌర్యాదులను గుఱించి యెఱుంగఁ జెప్పవలసినిదని యగస్త్యు నడిగెను. అగస్త్యుఁడా వృత్తాంతము లన్నియు వివరముగా నెఱింగించెను.

ద్వితీయ తృతీయాశ్వాసములందు మాల్యవదాదుల వృత్తాంతము వివరింపఁబడినది. అది అనవసరమగుటచే చాల సంగ్రహింపవలసిన భాగము. అందుచేతనే రాముఁడుకూడ నా వృత్తాంతమువిన్న పిమ్మట "మాల్యవదాది వృత్తము పరిసంగాధీనమై పుట్టెన్...రావణాదుల కథల్ ముట్టం బరికింపుఁ"డని యడిగియుండెను.

తృతీయ చతుర్థ పంచమ షష్ఠ సప్తమాశ్వాసములలో రావణుఁడు, అతని సోదరులు, ఇంద్రజిత్తు, వాలిసుగ్రీవులు, హనుమంతుఁడు మున్నగువారి జననాది వృత్తాంతములు రమ్యముగాఁ జెప్పఁబడినవి. పూర్వరామాయణమున కనిపించువారి పరాక్రమ ప్రాభవములకుఁ గారణమంతయు నిక్కడ వ్యక్తమగును. ఇందు చాలభాగము రావణుని దిక్పాలవిజయమునకు సంబంధించినది. ఆ సందర్భముల నతఁడు ప్రదర్శించిన పరాక్రమ మప్రతిమానమైనది. అట్టివాఁడు సైతము వాలిచేతను, కార్తవీర్యార్జునునిచేతను బరాజయము ననుభవించెను. ఈ విషయము తాడిఁదన్నెడి వానిం దలదన్నువాఁ డుండు నను సత్యమును వెల్లడించుచున్నది. పంచమాశ్వాసమందలి వేదవతి వృత్తాంత మతిరమ్యమైనది. ఆమె రావణునిచే బన్నమొందియు తపః ప్రభావోన్నతికి చేటు కలుగునని యతని శపింపక తన్మృత్యు కారణమై యయోనిజమూర్తి దాల్చి పునరుద్భవమయ్యెను.

మొదటి యేడాశ్వాసములు యుద్ధమయములు. ఆ యుద్ధము లన్నిటిని తిక్కన చక్కగా వర్ణించెను. భారతమందలి యుద్ధపర్వము

లలో నతఁడు ప్రదర్శించిన యద్వితీయ యుద్ధవర్ణన కౌశలమునకు బీజము లిందు పొడగట్టును. విష్ణువు మాల్యవదాదులతో పోరి వారి నోడించుటయు, రావణుఁడు దిగ్విజయ మొనరించి యమవరుణ కుబేరుల పరాభవించుటయు వీరరౌద్రముల కాటపట్టులై యతని యనన్య సామాన్య పరాక్రమమును జాటుచున్నవి. మేఘనాదుఁ డింద్రునోడించి చెఱపట్టిన వృత్తాంత మట్టే తిక్కన యుద్ధవర్ణన నైపుణమున కింకొక నిదర్శనము.

హనుమంతుని యతిలోక పరాక్రమమును విన్నప్పు డెవ్వరికైన వాలి సంహారణమున నతఁడు తన ప్రభువున కేల సాయముచేయలేదను సందేహ ముప్పతిల్లును. దాని కిందు తిక్కన చిత్రమైన సమాధానము చెప్పియున్నాఁడు. హనుమంతుఁడు బాల్యమున శిశుకేళీలోలుఁడై మున్యాశ్రమముల కేఁగి యాగోపకరణాదులకు గాసి చేయుచుండ మును లతఁడు "తన శక్తియు వరలాభంబున వచ్చిన పెంపు నుల్లమునఁ దలపక" నిజబల మెఱుఁగని గజజాతివలె నగుఁగాక"యని శపించిరి. తిక్కన దానిని పురస్కరించుకొని యతఁడు "తనలా వెఱుఁగని కతమున నినసుతునకు వశ్యుఁడయు నేడ్తెఱ సంక్రందననందను భుజబల మర్దనమునకుఁ గడంగఁడయ్యె"నని కారణము నెఱింగించెను.

అష్టమాశ్వాసమును మిగిలిన రెండాశ్వాసములను సీతారాముల చరిత్రకు సంబంధించినవి. అష్టమాశ్వాసము దివ్యప్రణయ సంపన్నులైన సీతారాముల విహార విశేషములను వర్ణించును. ఇచ్చటి వర్ణనలించుక దీర్ఘతరములుగనే యున్నవి. అవి యట్లుండుట కావశ్యమున్నది. అవి సీతారాముల ప్రణయముయొక్క నైర్మల్యమును అగాధతను సూచించును. తరువాత కనవచ్చు సీతాగర్భధారణ వృత్తాంతమును పురస్కరించుకొని చూచినచో నీవర్ణన లౌచిత్య భాసురములుగనే కనిపించును. మఱియు సీతారాముల ప్రణయమందలి నైశిత

మును గ్రహించినఁగాని తరువాత సీతాపరిత్యాగ సందర్భమున రాముఁడు ప్రజానురంజనమునకై చేసిన త్యాగగరిమ బోధపడదు. ప్రజారంజనమునకై రాముఁ డట్టి యనన్యాదృశ్యమైన ప్రేమనుగూడఁ దృణీకరించి యనపరాధ యని యెఱింగియు జానకిని పరిత్యజించెను. అది రాముఁడు తప్ప నితరులు చేయలేనిపని.

రాముని రాజధర్మప్రవీణత్వముల కీ యుత్తరరామాయణమున నింకొక నిదర్శనమున్నది. శత్రుఘ్నుఁడన్న యానతిపై మధురాపురి కరిగి లవణాసురుని సంహరించెను. అట పండ్రిండేడ్లు పరిపాలించిన పిమ్మట నతనికన్నను జూడవలయునను బుద్ధిపుట్టెను. అతఁడు వచ్చి యచ్చటి వృత్తాంతమంతయు చెప్పి, "మిముఁగొలుచు సుఖంబునకు రాజ్యము సౌఖ్యంబీడఁగాదు నందునికిఁ జిత్తము గొలుపక" వచ్చితి ననిచెప్పెను. రాముఁడు నవ్వి "నానావిధ దేహ దుఃఖము మనంబున నోర్చినఁగాక రాజ్యలక్ష్మి విభవంబు సొప్పడునె, కేవలమే నృపతిత్వ మారయన్" అని పల్కి మరల నతని పంపివైచెను. అతని రాజధర్మ పరిపాలన తత్పరత్వ మట్టిది.

శంభూకవధ ఘట్టముకూడ రాముని రాజధర్మైక పరాయణ తను సూచించునట్టిదే. విప్రపుత్త్రుఁడు మరణించుటకు రాజైన తన లోపమే కారణమైయుండునని యతఁడు భావించెను. ఆలోపమును దీర్చుటకై యతఁడు పశ్చాత్తప్తుఁ డగుటచే అనన్యగతికుఁడై శంబుకుని వధించెను. అతని చేతిమృతి శంబూకుని కుత్తమగతి ప్రాప్తిహేతు వయ్యెను. భవభూతికూడ నీ విధముగనే యీ సందర్భమున శ్రీరాముని కార్యమును సమర్థించెను.

దశమాశ్వాసమున శ్రీరాముఁ డశ్వమేధ మొనరించెను. దానిని తిక్కన సంగ్రహముగా వర్ణించెను. అది రామకుశలవ పునస్సమాగమమునకుఁ గారణమయ్యెను. వాల్మీకి రామునికి సీతనుగూడ గ్రహింప

వలెనని యుపదేశించెను. రాముఁ డామె శపథము చేయవలెనని పలి కెను. సీత రామవిభుని కేను దప్పనిచాననేని నన్ను నీలోఁ జేర్చుకొనుమని భూమిని ప్రార్థించెను. భూమి యట్లే చేసెను. కుశలవులు వాల్మీకి యుపదేశము ననుసరించి భూదేవి తప్పు సైరింపవలెనని రాముని ప్రార్థించిరి. ఈవిధముగా రామునికి పుత్త్రసమాగమము కలిగినను పత్నీవియోగము తప్పినదికాదు. ఇది కావ్యమును విషాదంతముగాఁ జేయుచున్నది. తరువాతి రామనిర్యాణ వృత్తాంతమును తిక్కన విడిచివైచెను.

నన్నెచోడుని కుమార సంభవమునవలెనే తిక్కన నిర్వచనోత్తర రామాయణమునఁగూడ పెక్కు ప్రబంధ లక్షణములు కనిపించును. అందలి వర్ణనలను జూచినచో నీ విషయము తేటతెల్లమగును. ప్రథమాశ్వాసమందలి అయోధ్యాపురవర్ణనము, షష్ఠాశ్వాసమందలి కైలాసమందలి సీతారాముల వినోదవిహార జలవిహార లీలావిహారాదివర్ణనములు ప్రౌఢములును అలంకార పరిపూర్ణములునై తరువాతి ప్రబంధములందలి అష్టాదశవర్ణనలకు మేలుబంతు లనఁదగి యున్నవి. రంభారావణుల సంవాదమునకు ముందు కావింపఁబడిన అంధకార చంద్రచంద్రికాది వర్ణనలందలి కావ్యత్వమునకేకాక తరువాత వర్తిల్లిన రావణుని కామప్రవృత్తికిఁ గూడ దోహదము కల్పించుచున్నవి. సీతారాముల విహారవర్ణన యౌచిత్యము నతిక్రమింపక యత్యుదాత్తమై యా పవిత్రదంపతుల హార్దమైన యనురాగసంపద ననేకవిధముల వెల్లడించుచున్నది. ఈ వర్ణనలలో నచ్చటచ్చట వంగ వర్ణనకూడ కనుపించును.

శ్రీనాథుఁడు చెప్పినట్లు తిక్కన రచనలో మొదటినుండియు రసదృష్టి హెచ్చు. రసభంగముచేయుట కుకవుల లక్షణమని యాతఁడు మొదటనే సూచించియుండెను. సప్తమాశ్వాసము చివర నగస్త్యుఁడు

రాముఁ డడిగిన రావణాదుల వృత్తాంతములన్నియు చెప్పుసరికి మధ్యాహ్నమయ్యెను. రాముఁ డప్పుడు వారిని వీడ్కొలుపనెంచి "మనలిరువురి విచిత్రకథారసప్రవృత్తిం దడ వెఱుఁగరాక, యనుష్ఠాన సమయమయ్యెను. ఈ విచిత్రకథారసప్రవృత్తి మన్నత తిక్కన రచనయం దెల్లెడ గోచరించును. మొదటి యేడాశ్వాసములలో యుద్ధవర్ణన సందర్భములందును, లవణాసుర సంహార సందర్భమునను వీరరసవరి ములు చక్కఁగా పోషింప బడినవి. రాముఁడు సీతను బరిత్యజించు నెడ ధర్మవీరము పరాకాష్ఠనందినది. రావణరంభా సంవాద సందర్భము నను, వేదవతీ వృత్తాంతమునను శృంగారాభాసమున్నది. వేదవతి వృత్తాంతము కరుణ రౌద్రచ్ఛాయలతోఁ గూడి రమణీయముగా నున్నది. అష్టమాశ్వాసమున ధర్మ్యమైనశృంగారము పోషింపఁబడినది. రావణునిచే చెఱపెట్టఁబడిన స్త్రీలు విలపించు సందర్భమునను, సీతా పరిత్యాగసందర్భమునను, రాముఁడు సీతకొఱకై విచారించు సందర్భమునను కరుణరసము నిర్భరమైయున్నది. భూదేవి సీతను తనలోనికిఁ దీసికొను సందర్భమున నద్భుతమున్నది. నందికేశ్వరుఁడు రావణుని శపించినప్పుడు రావణుఁడు "వానరవదనంబు నట్టులున్న నందిమెుగ మర్ధు తేరఁజూనంగ(జూచి, కడుఁబెల్చనవ్వి యగు నీవదువునఁ జెలువం బుగలుగు వారలచేతం జెడఁడే యాతఁడు నుడువక యుడుగుమని" యుల్లసమాడు సందర్భమున హాస్యమున్నది.

రాక్షసులు సామాన్యముగా నిష్కరుణులై కూరతకు నిల యములై యుందురని మనము భావింతుము. తిక్కన మొదటియే డాశ్వాసములలో మాల్యవద్రావణాదులను మహావీరులుగనే కాక దయాప్రీతి సానుభూతి ప్రముఖ గుణగణముల కాటపట్టులుగాఁ గూడ వర్ణించెను. చెల్లెలైన శూర్పణఖకు వివాహము చేయుటనుగూర్చి రావణుఁ డనుజన్ములతో నాలోచించుట (3 అశ్వా. చివర) శూర్ప

ణకు భ్రాతృనిహతుఁడైన భర్తకై విలపించుట మున్నగు ఘట్టము లిందుకు నిదర్శనములు. ఉత్తరభాగమున సీతారామలక్ష్మణుల పాత్రము లద్భుతముగా పోషింపఁబడినవి. రాముని రాజధర్మప్రవణత యసామాన్యమైనది. ప్రజారంజనము, భార్యానురాగము అను భావములకు సంఘర్షణము సంభవించినప్పు డాతఁడు ధైర్యమువిడువక ఉత్కృష్టతరమైన ధర్మము నాచరించెను. అట్లే శంబూకుని వధింపవలసివచ్చి నప్పుడును ఆతఁడు ధీరతతో నాలోచించి యుచితక్రమము నవలంబించెను. లక్ష్మణుఁడు తనకు పరిత్యాగవార్త నెఱిఁగించిన పిమ్మట సీత యతనితో పల్కిన పల్కులామె పాతివ్రత్యమును ఆభిజాత్యమును వేయివిధముల ప్రదర్శించుచున్నవి. లక్ష్మణుఁడు భ్రాతృభక్తిసేవధి. రామునియందలి భక్తి, సీతయందలి గౌరవము సీతాపరిత్యాగ సందర్భమున నతని హృదయమున నొక ప్రళయము కలిగించినవి. అందుండి శాంతుఁడై బయటపడుట యాతని ధీరతకు తార్కాణము. ఇట్లే తిక్కన భరతశత్రుఘ్నుల పాత్రలనుగూడ నుచితముగాఁ బోషింపఁజాలెను.

భారతమునందుకంటె నుత్తరరామాయణమున తిక్కన కవిత్వము, శైలి కొంచె మపరిపక్వదశలో నున్నవని కొందఱి యభిప్రాయము. ఇది వాని రచనాకాలముల పౌర్వాపర్యములను పురస్కరించుకొని చెప్పుమాట. నిజము పరికింప నుత్తర రామాయణమునందలి శైలి భారతమునందలి శైలి కెందును తీసిపోదు. ప్రౌఢతయందు, భావనాబలమునందు, పదప్రయోగమునందు, రసపాత్రపోషణాదులందు మహాకవియైన తిక్కనయే యిందునుగోచరించును ఇందు సంస్కృతాంధ్రములకు సమాన ప్రాధాన్యము కానిపించును. భారతమున నిందుకంటె తెలుఁగుతనము హెచ్చు. ఈ కావ్యమున తిక్కన వర్ణన సందర్భము నలంకారములను హెచ్చుగా వాడెను. "ఉజ్జ్వలలక్ష్మికి నుద్భవస్థానమై"

(౧-52) అను పద్యము శ్లేషానుప్రాణితమై నగర రత్నాకరములకుఁ గల యౌపమ్యము వివరించుచున్నది. "ఉడుగక కాల్చుచునుండెడు శోకంబ" (౫-11) అను పద్యమున సంపూర్ణ రూపకమున్నది. "ఒక్క చందురుండ" (౫-117) అను పద్యమున రూపకోత్ప్రేక్షలున్నవి. ఇట్టివాని ననుకరించి తరువాతి ప్రబంధకవులు వానికి మిక్కిలి ప్రాచుర్యము కలిగించిరి. ఇందు శబ్దాలంకారము లున్నవి కాని యవి యప్రయత్న సిద్ధములైనవే. నిర్వచనోత్తర రామాయణపద్యములు క్లిష్టాన్వయము లేక ధారాళములై యింపుగొల్పుచున్నవి. ఇందలి పెక్కు పద్యములను తిక్కన భారతమునం దాయా సందర్భముల నించుకమార్పులతో ప్రవేశపెట్టుటయే యతని కిందలి కవిత్వముపైఁ గల గౌరవాభిమానములకు నిదర్శనము. ఈవిధముగా నిర్వచనోత్తర రామాయణము తిక్కన తొలిరచనమయ్యు రచనా భావభావనా మహిమలయందున్నతమై రసాలంకారశోభితమై ఔచిత్యపూరితమై చక్కని ప్రబంధమువలె నలరారుచున్నది.

---

# ఎఱ్ఱన కవీంద్రుని కవిత్వవైభవము

(శ్రీ చేబ్రోలు చిన్మయ బ్రహ్మము-రాజమహేంద్రవరము)

నన్నయ పదునొకండవ శతాబ్దిని ప్రారంభించి, సర్వతోముఖ సౌభాగ్యసంపన్నముగా నొనర్చిన సాహిత్యవ్యవసాయము ఆంధ్ర భారతమందలి యరణ్యపర్వస్థ చతుర్థాశ్వాసములోని 'శారదరాత్రు లుజ్జ్వలలసత్తర తారకహార పంక్తులన్' అను పద్యముతో నిలిచిపోయి నది. తరువాత రెండు శతాబ్దుల కాలము గడచినఁగాని గీర్వాణాంధ్ర ప్రావీణ్య ప్రాభవములుగల తిక్కనకవి రాజుదయింపలేదు. పంచమ వేదమగు నీ యాంధ్ర భారతరచనకునై నిరుపమ నిష్ఠాగరిష్ఠుఁడయి యజ్ఞమొనర్చియే భారత కావ్యశ్రీకి విరాటపర్వమునుండి శ్రీకారము చుట్టెను. కాని నన్నయ విరచితారణ్య పర్వ శేషమును బూరింపలేదు. వాగనుశాసనబిరుద విరాజితుఁడును, ప్రసిద్ధ మాంధ్రలక్షణస్రష్టయు నాదికావ్యనిర్మాతయునగు నన్నపార్యునికరిష్టమును గూర్చిన యరణ్య పర్వ శేషమును బూరింప శంకించిరో, కేవల మాభాగము పాండవ వనవాసక్లేశ చరిత్రమనియో కవిబ్రహ్మ యా వంకకుఁ బోలేదు. పదునైదుపర్వము లేకధాటిగా నాంధ్రీకరించి జగద్విఖ్యాతిని సముపా ర్జించెను. తరువాత సుమారు నలుబదియేండ్ల పిమ్మట 1310 ప్రాంత మున నుభయకవితా విశారదుఁడును, పూర్వకవి ప్రయోగహిత రచనాభిలాషియు, హరివంశాది ప్రబంధనిర్మాణ కుశలుండయిన చద లువాడ ఎఱ్ఱన కవీంద్రుఁ డీ భారతకథ స్వజాత్యభ్యుదయాభి వర్ణనం బగుటం జేసియు, నాంధ్ర భారతసుందరి సౌందర్యశోభకు స్వల్పలో పమాపాదించిన యరణ్య పర్వ శేషమును బూరింపనెంచెను.

ఎట్లో కథను నడిపించితిమను దృష్టితోఁగాక తన యాంధ్రీకరణ మట్టు నిరంకుశ కవిత్వ విదగ్ధుండగు నన్నయ ప్రసన్నకథా కలితార్థ యుక్తముగను నిటు తిక్కన సోమయాజి పదగౌరవ జాతీయ భావ గంభీరతా సంపన్నముగా నొనర్చియుభయకవితావార్ధులకు స్వర్ణసేతు

వుంగట్టి యాంధ్రుల కెనలేని మహోపకార మొనర్చిన ధన్యచరిత్రుఁ
డెఱ్ఱన. స్వీయప్రతిభావర్ణన వ్యాజంబున రాణ్మహేంద్రుని ప్రోత్సా
హము నన్నయకు లభింపఁజేసియు, మన్మసిద్ధి నృపాలు నాదరాభి
మానములు తిక్కన కవీంద్రునకుఁ బ్రాపింపఁజేసియు, ప్రోలయవేమ
ప్రముఖ రాజేంద్రుల కృప, యెఱ్ఱన కవివర్యునకు ప్రసాదించియు మన
భారతి యాంధ్రజాతికిఁ దఱుగనోని విజ్ఞాన సర్వస్వపేటికను సంపా
దించి పెట్టినది.

ఎఱ్ఱన కవివర్యుని వంశ్యులు రాజానుగ్రహ పాత్రులయిన
మంత్రులగుటంజేసి వీరి వంశము ప్రెగ్గడవంశమైనది. ఎఱ్ఱాప్రెగ్గడ
యను నామ మే లోకవిదితమైనది కాని ఎఱ్ఱన యనిన నెవ్వరో యని
పించును. పార్వతీధవచరణాబ్జ ధ్యాన నిమగ్నుండగుటంజేసి 'శంభు
దాసుఁడ'ను నామాంతరము వెలసినది. భారతారణ్య పర్వశేషమును
ప్రబంధ శైలీబంధురముగా రచించుటంజేసి ప్రబంధ పరమేశ్వర బిరు
దము ప్రాప్తించినది. ఈకవి కొండవీటి ప్రభువగు ప్రోలయ వేమా
రెడ్డికి, రామాయణమును హరివంశము నంకితముచేసెను. అహోబల
మాహాత్మ్యమను నామాంతరముగల లక్ష్మీనృసింహ పురాణమును
నరాంకితము సేయకయహోబలస్వామి కంకిత మొనర్చియుండెను.

అరణ్య పర్వమునందు చతుర్థాశ్వాసమున నహుషునికి వలసిన
సమాధానములు చెప్పి ధర్మరాజు నిర్బంధితుఁడైన భీమసేను నాశ్రమ
మునకుఁ దీసికొనివచ్చెను. అంతవఱకు ఖరకిరణతాప మత్యధికముగా
నుండుటచే శోషితములైన వనతరువులకుహితముగా వర్షోదయమైన
దని నన్నపార్యుడు వర్ణించియున్నాఁడు. పిమ్మట శరదృతువర్ణనము
మఱి రెండుపద్యములతోఁ జేసి పరమపదించియుండెను. చివర శారద
రాత్రు లుజ్జ్వల యను పద్యాంతమునఁ బరిపూరితంబులై యను
పదమప్రయత్నముగా నన్నయ ప్రయోగించియుండెను. శరత్కా-

లము, శారద రెండును సుందరములే. అందు శరద్రాత్రులు ప్రకా
శిత తారహారములచే విరాజిల్లుచున్నవి. వికసించిన కల్వల సుగంధ
ముచే నిండిన తెమ్మెరలతో నిండియుండెను. అంతియేగాక అమృత
కరుని కిరణాలనుండి జాలువారుచున్న కర్పూరపరాగమువంటి కాంతి
రేఖలచే సంభరితములై యున్నవని చెప్పుటలో వాగ్దేవి శబ్దార్థాలంకార
తారహార విరాజితయే కాదు, వికసితకుముద సువాసనాన్విత మంద
పవన శైలీ మధురమంజులయయి, హిమాంశునిర్గళిత కర్పూరపరాగ
సదృశసుధాశీతలమై యుండె ననుభావాంతరము పొడసూపుచున్నది.
శారదాదివ్యానుగ్రహమ్మున నింతవఱకుఁ బూరింపఁబడిన యీ
యాంధ్రభారత మెరులచేఁ బూరింపఁ బడనున్నదను నర్థముకూడ
స్ఫురించుచున్నది. మహర్షి వాగ్విలసితుఁడైన నన్నయవలెనే మిగిలిన
యిర్వురు కవిరాజు లంతటివారనుట కెన్నో నిదర్శనము లున్నవి.
ఎఱ్ఱన శరదృతువర్ణన మారంభించి గతించిన నన్నయగారి యభిమ
తానుసారముగా నయిదాఱు పద్యముల వర్ణించియే కథావిషయము
నకు వచ్చెను. ఇట్లొనరించుటవలన నాదికవి భావానుసారమునఁ
గృతకృత్యుఁడైన పూర్వకవి విధేయుఁ డీ కవి యనవచ్చును. ఇతర
కవు లెవ్వరైనను స్వీయవంశాభివర్ణనంబున కుపక్రమించి కవిత్వపటు
త్వంబుల నగ్గడించి యుందురు. అట్లు స్వల్పస్వగత ప్రసంగమును దెచ్చి
నిసర్గ కథామృత ప్రవాహమున కంతరాయము కల్గించుట యరసిక
తయే యని భావించి, యక్షరాల నన్నయ నాదరించి, తత్కవితా
జ్యోతిలో నంతర్లీనమైన మహాత్ముఁ డెఱ్ఱన. అక్షరరమ్యతలోను,
కథోచితవిషయ కథనకౌశలంబున, వర్ణనవైభవంబునఁ, బాత్రోచితీ
సంభాషణ నిర్వహణ సామర్థ్యంబున, ప్రామాణికత్వాది నిరూపణ
ప్రావీణ్యంబున నీ కవి, కవిమాన్యుఁడై నాఁడు. సుమారుమూఁడాశ్వా
సములు మాత్రమే యాంధ్రీకరించినను, నతుకులబొంత యనుట

కే మాత్రి మవకాశమీయక పరస్పర కవి భావనానుకూల్యమునే యీ కవిగణ్యుఁ డనుసరించియుండెను.

అత్రిగౌతములసంవాద సందర్భమున గౌతమునిచే ఆ। వె॥ కలయ నరలువచ్చి తలతెల్లనైనంతఁ జేసి యెట్లు నీకుఁ జేతునెతుక, జ్ఞాన వృద్ధుఁడైన వానిమాటలు గదా!! సభలఁజెల్లునార్య జనులకెక్క’ యనిపించుటచే నీకవి వేషభాషాదికాడంబరమును గోరని జ్ఞానవృద్ధుఁ డనియు, నట్లుకానిచో తనమాటలు సభాసదులగు నార్యుల మనస్సులను రంజింపఁ జేయవను స్థిరచిత్తుఁడని వ్యక్తమగుచున్నది నన్నయ సరళసమాస బంధురత నక్షరరమ్యతను, తిక్కన యాగమోక్తి ప్రావీణ్యంబు నీకవి యెట్లు సాధించెనో చూతము. నన్నయ వీరరసస్ఫోరకముగాఁ బ్రద్యుమ్నునిచేఁ జెప్పించినపుడు 'అవనీనాథ లదాహవాంతరమునం దస్మత్కరాకృష్టశా। ర్ఙ్గవినుర్ముక్త నిశాతసాయక శతాగ్రిచ్ఛిన్నమై, దైత్యదా। నవదేహప్రకరంబు, వాతవిధుతార్ణః పూర్ణ సంఘూర్ణితా। ర్ణవకుక్షింబడియెం, గపిప్రకరసైన్యక్షిప్త శైలాకృతిన్''- అని రచించియుండెను. ఇట్టి పరాక్రమప్రకటనమందే తిక్కన భీముఁడు పరాక్రమమును ద్రౌపదికి వెల్లడించునపుడు "అవనీచక్రము సంచలింపఁగ, దివంబల్లాడ నాశాచయం। బవఘూతంబుగ, గోత్ర శైలనికరం బాకంపముం బొందన। ర్ణవముల్ ఘూర్ణనమొందఁ, గ్రోధముకృతార్థత్వంబు నొందించి చి। త్రవధ ప్రౌఢినహించి సూతునకు రాద్ధిం జేర్పడం జూపెదన్'అని వర్ణించి యుండెను. ఇట్టి పత్రి పావిష్కరణ సమయంబున, ఎఱ్ఱన, ద్రౌపది సైంధవునకు ధర్మజుని విక్రమంబుచెప్పు చోప్పున "తనువృత్తాంగుఁడు, శుద్ధకాంచన సముద్యద్వర్ణుఁ డత్యుల్లస। ద్వనజాతాయాత చారులోచనుఁడు, దీవ్యద్భూరి తేజోఘనుం। డనఘుండల్ల రథంబుపై వెలుఁగు పుణ్యాత్ముండు ధర్మాత్మజుం। డవిరోధ ప్రతిభా ప్రభావనిధి యత్యైశ్వర్య శౌర్యుం

డనిన్' అని రచించియుండెను. మత్తేభవృత్తములనే విక్రమ ప్రక టనమున ముగ్వురు కవు లుపయోగించియున్నారు. ఈ పద్యము లొక దానిపై నొకటి డీకొను చున్నట్లుండి అసమానములై యున్నవి. వర్ణ నాత్మక విషయమున నీ ముగ్వురు కవులు కందపద్యముల నెట్లు నడి పిరో గమనింతము. నన్నయ 'సురచాపచిత్రిగగన స్ఫురణంబురణించు నట్లు భూవనిత నిరంతర చిత్రితయై యొప్పెను సురుచిరనవతృణ శిలీంధ్రి సురగోపములన్' అట్లే తిక్కన సూర్యాస్తమయమును వర్ణించునపుడు 'ఇనుఁడు తనకడకు నేతెంచిన రాగము బొందు టది యుచిత మనఁగాఁ గెంపున మెఱసి పశ్చిమాశాంగనజన సంభావముల గౌరవమందెన్'' ఎఱ్ఱన వర్షర్తువర్ణన సందర్భమున 'కలనీలకంఠ కోలా హల లీలలు సెందె రాజహంసకులములన్, దిలకించె సప్తపర్ణావలి వికసిత కుసుమకుటజ వాటికలగడన్' ఈ విధముగాఁ దనకుఁ బూర్వు లైన కవిరాజద్వయ మొనర్చిన ప్రయోగదక్షత నాయా కావ్యప్రసం గమున నప్రమత్తుఁడై యెఱ్ఱనకవి బహుముఖ ప్రజ్ఞాశాలియై కవితను నడిపెను. వారిరువురికంటె నీతఁడు నవ్యుఁ డగుటంజేసి క్రొంగ్రొత్త పోకడల నందందు చూపించెననుట కొక పద్యము. "చెఱకుందోటలఁ బెంచి, శాలిమయ సుక్షేత్రస్థలుల్నించి య। క్కఱ లేకుండఁగఁ బూగనాగలతికా కాంతారముల్ప్రోచియే। త్తెఱనంతంగుముదోత్ప లాళి వననాటీకోటిఁ జాటించి పె। న్నెఱువుల్వ్రాల్చెఁ బురంబునన్దెసల బ్రస్ఫీతాంబు పూర్ణస్థితిస్." ఇది రామాయణాంతర్గతము. ఇందలి వర్ణ నము నవ్యమై కన్పట్టుచున్నది.

ఎఱ్ఱన కవీంద్రుఁడు తన నృసింహపురాణమున నన్నయ తిక్క నలనే పూర్వ కవులనుగా 'భాసురభారతార్థముల భంగుల నిక్క మెఱుంగనేరమిన్ గాసటబీసటే చదివి గాథలఁ ద్రిప్ప తెనుంగువారి కిన్ వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లఁగఁజేసి నట్టి యజ్జ్వాసన

కల్పలందలఁతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్' అని ప్రస్తుతించు
టలోఁ దాను వారి నతురబ్రహ్మత్వ గురుత్వమునఁ బ్రతిష్ఠించినట్లు
స్పష్టమగుచున్నది. ఈ కవియే తన హరివంశమున నన్నయభట్ట కుం
జరం బెన్న నిరంకుశోక్తి గతిని, దాఁ బల్కిన బల్కు లాగమములై
పోల్పొందు - కవిబ్రహ్మ నావినుతింతునని ప్రస్తుతించి సహజ గురు
భక్తి తాత్పర్య ప్రాబల్యములను ప్రకటించి యుండెను.

అయినను బల్కినఁ బల్కు లాగమములై పోల్పొందు కవి
బ్రహ్మ కవిత్వసరణియం దీ కవి కెక్కువ మక్కువయున్నట్లు తోఁచు
టేకాదు. తన కావ్యములం దచ్చటచ్చట నా పోకడలఁ బోనిచ్చి
తదభిమాన ముగ్గడించియుండెను. తిక్కన విరాటకృత్యాదిని వంశాభి
వర్ణనము పట్టున రచించిన సీసపద్యమువలెనే, తన నృసింహ పురా
ణారంభమందు 'ప్రజ్ఞాపవిత్రుఁ డాపస్తంబ సూత్రుండు శ్రీవత్స
గోత్రుఁ డూర్జిత చరిత్రుఁడగు బొల్లనకు ..అని చెప్పి తిక్కనకై
తననుకరించి యుండెను.

ఈ కవీంద్రుఁడు వర్ణన విషయమునఁ గొలఁది వృత్త్యను ప్రాస
దికము పాటించినను, వర్ణనవైభవమును ప్రతిభా పరిపూర్ణముం
జేయుటయం దెక్కుఁడు శ్రద్ధమూపించినట్లు పెక్కుచోట్ల కాన్పిం
చును. కుమారస్వామి చెంతకు మహేశ్వరుఁడు వచ్చినపుడు 'నానా
సిద్ధగణంబు గొల్వఁ బరమానందంబు నంజంద్ర రేఖాసద్ధాంచితమౌళి
భూరిభుజగాకల్పోజ్జ్వలాకారుఁ డీశానుండానత శంకరుండు గిరిజా
సంయుక్తుఁడై వచ్చెఁ దత్సేనానిం బ్రియసూను షణ్ముఖుని వీక్షింపంగఁ
బ్రేమంబుతోన్'' అను నీ పద్యమున శబ్దాలంకార దృష్టికంటె వర్ణన
వైభవ వైశిష్ట్యమునకే మక్కువ చూపియున్నాఁడు.

తన హరివంశమున కాళీయమర్దన పూర్వఘట్టమున కృష్ణుఁ
డొక కదంబ వృక్షము నెక్కుచు భావించునపుడు వ్రాయఁబడిన

రొక చిన్ని గీతపద్య మీ మహాకవిని విశ్వకవినిగాఁ జేయుచున్నది. ఆ పద్యమిది "ఇదిమదీయ పదస్పర్శ పదవిగాంచి యఖిలలోక నమస్కార్య హారిమహిమ నార్జితంబగుఁగాక యింపొనర దీనినెక్కి యున్నటనుటెకెద నక్కజముగ." ఆ కదంబవృక్షము కాళీయోత్కటోరగ విషంబున విషాదంబు నొంది యుండుటంజేసి జాలిపడి స్వస్వరూపమును గోలుపోయిన యాతరురాజము తన దివ్యచరణ స్పర్శచే సకలలోక వందనీయ మహిమనందఁగలదని వాసుదేవుఁ డూహించునట్లే కవి రచించెను. "ఆత్మవత్సర్వభూతాని" యని వచించు నుపనిషత్సుధా సూక్తులు సమన్వయింపఁ జేయుచు, శ్రీకృష్ణుని మూర్తిత్వమును విశ్వవ్యాప్తమహోన్నతముగాఁ జేసిన యీ కవిపుంగవుఁ డెంత యంతర్ముఖ దృక్పథముగలవాఁడో యూహింపవచ్చును. ఒక వాక్యమైనను రసవత్త్వపూర్ణమై యుండినది కావ్యత్వ మందికొనునను మనీషుల వాగ్ధోరణినిబట్టి కవీంద్రుల రచనలో నట్టి విశిష్టాంశ మున్ననాఁడే వారి కవిత్వ ప్రాభవము విశ్వశ్రేయోనిధానము కాఁగలదు. నన్నయ తిక్కనల రచనలలో నిట్టి విశేషాంశము లెందఱో యింతకుపూర్వమే వెల్లడించి యుందురు. ఈ కవీంద్రుని మహోదారకవితా వైశిష్ట్యములు తెలుఁగుతల్లి శ్రమించి సముపార్జించిన బహు పుణ్యపరిపాక పుంజ మనకతప్పదు. అష్టాదశపర్వ పరిపూరితమ్ముగ నొనర్చిన యీ ప్రబంధ పరమేశ్వరుని ఆంధ్రజాతి భక్తిపురస్సరముగ పుష్పాంజలి సమర్పించి కృతకృత్యము కాఁగలదు.

---

# "అన్నమయ్య – సర్వేశ్వర శతకము"

శ్రీ పరాశరం గోపాలకృష్ణమూర్తి, ఎం.ఏ. – సిద్ధిపేట.

శతకప్రక్రియ సంస్కృతమునుండి సంక్రమించినదైనను దెనుఁగున నొక ప్రత్యేకతను సంపాదించుకొనియున్నది. సంస్కృతమున మయూర శతకము, భర్తృహరి నీతిశతకము మున్నగునవి యున్నను దెనుఁగు శతకముల లక్షణములు వానికి వర్తింపనేరవు. కావ్యముల యందుఁ గవి స్వేచ్ఛగాఁ దన భావములను వెల్లడింప వీలుండదు. అచటఁ గ్రమానుపూర్వి యుండవలయును. శతకములయం దయినఁ గవి తన స్వీయానుభవమును బురస్కరించుకొని తన యభిమతాను సారముగాఁ బద్యములను గూర్చుట కెక్కువ యవకాశముండును.

సుమతి శతకము చక్కని నీతులను, వేమన పద్యములు సత్త్వవర్తనమును, ఆంధ్రనాయక శతకము నాఁడు పూజలేక పడి యున్న యాంధ్రవిష్ణుదేవుని దుస్థితిని, సింహాద్రి నారసింహ శతకము తురుష్కుల యమానుషకృత్యములను వెల్లడించుచున్నవి. ఇట్లు తమకుఁ దోఁచిన యంశమును వివరించి, యాత్మీయతను జోడించి, చెప్పుటకు వీలుండుటవలన నాంధ్రమున శతక వాఙ్మయము విరివిగాఁ బెరిగిపోయినది. కొన్ని శతకములు నీతిని, గొన్ని భక్తిని, గొన్ని మతప్రచారమును, గొన్ని సాంఘికోద్బోధము మొదలగు వానిని బ్రధానవస్తువుగాఁ గైకొని వ్రాయఁబడినవి. తమ యనుభవపూర్వకమైన సునిశిత భావములను సూటిగ జానుఁదెనుఁగునఁ జెప్పుటకు శతకములు వీలుగానున్నవి. కావున సంస్కృత మూలమునుండి యంటు త్రొక్కఁబడినదైనను శతక వాఙ్మయము తెనుఁగు మాగాణమున మహావృక్షమై స్వాదుఫలముల నందఁజేసినది. చిట్టచివరకు శతకములనినఁ దెలుఁగుభాష సొత్తే యనుభావము కలుగునంతకు వృద్ధిచెందినది. పద్యము లల్లఁగలిగినవారెల్లరు తొలుదొల్త నొక శతకమును వ్రాయుచుండుట కొంతకాలము తెలుఁగునాఁటఁ బరిపాటియైనది.

తెలుఁగు సారస్వతమున శతకములకుఁ గల ప్రాధాన్యమును బ్రాచు
ర్యమును దెలుపుట కింతకన్న మఱియొక నిదర్శన మక్కఱలేదు.

తెనుఁగు భాషలోని శతకములు సామాన్యముగా నేదేని మకు
టమును నియతముగాఁ గలిగియుండి నూటికిఁ దక్కువగాని పద్యము
లతోఁ గూడియుండును. అంతియేకాక నిర్దిష్టమగు మకుటమునకు
సరిపడు సజాతీయచ్ఛందములే యొక శతకమున నుండును. (అనఁగా
శార్దూలమత్తేభములు, చంపకోత్పలమాలలు - ఇత్యాదిగా-) నీతి,
బోధ, భక్తి మొదలగు వానిలో నేదేని ప్రధానముగ నుండును.
ముక్తకములఁబోలు నిందలి పద్యములు మకుటమను సూత్రమున
గ్రుచ్చిన విరులవలె నలరారుచుండును.

ఆంధ్ర శతకమాలలో సర్వేశ్వర శతకము రెండవప్రసూన
మనవచ్చును. దీనిని యథావాక్కుల అన్నమయ్య రచించెను. తన
కాలమును నామమును జెప్పుకొన్న శతకకవులలో నితఁడే ప్రథ
ముఁడు. ఇతని శతకమునందు సంస్కృత శివమహిమ్నస్తోత్రము, కన్నడ
సోమేశ్వర శతకము పోలికలు కన్పించును.

"శాకాబ్దంబులు వార్ధిషట్కపురజిత్సంఖ్యం బ్రవర్తింప సు
శ్లోకానందకరంబుగా మహిమతో శోభిల్ల సర్వేశ్వర
ప్రాకామ్యస్తవ మొప్పఁ జెప్పె శుభకృత్ప్రవ్యక్త వర్షంబునన్
శ్రీకంఠార్పితమై వసుంధరపయిం జెన్నొంద సర్వేశ్వరా"

అని కవియే చెప్పుకొని యుండుటవలన శాలివాహన శకము
1164 కు సరియగు శుభకృత్సంవత్సరమున (1164+78=1242 A.D)
నీ శతకము రచింపఁబడియెను.

ఇతఁడొక్కొక్క పద్యము నొక్కొక్క తాటియాకుపై వ్రాసి
కృష్ణలోవైచి యది ప్రవాహమున కెదురీది వచ్చిన స్వీకరించెదను.
లేకున్న గండకత్తెరతోఁ గుత్తుక నుత్తరించుకొనెదనని శపథముచేసి

యటులే చేయుచుండ "తరులం బువ్వులు పిందెలై యొదవి..." యను పద్య మెదురురాకుంటయు నతఁడు కంఠమును గత్తిరించుకొనఁ బోవుటతో నొక పసులకాపరి యొక తాటియాకునిచ్చి యదృశ్యుఁడయ్యెనఁట. పసులకాపరి తెచ్చిన యాకునఁ బైపద్యమునకుమాఱుగా 'ఒక పుష్పంబు భవత్పద ద్వయముపై ...' పద్యముండెనఁట. తాను జేసికొన్న నియమము ప్రకార మా శతకమును బూర్తి యొనర్చి, పిదప నచ్చటనే సత్రశాలయను పుణ్యస్థలమున సిద్ధినందినట్లు చెప్పుదురు. ఈ యైతిహ్యము భక్తిరసోద్బోధకమయి సర్వేశ్వర శతక ప్రాశస్త్యమును దెలిపెడి యర్థవాదమువలె నున్నది.

యథావాక్కుల అన్నమయ్య సామాన్య శివభక్తుఁడు కాక వీరశైవుఁడు. కావుననే "తమ లింగార్చనకంటె జంగమము సౌందర్యంబుగాఁ గొల్చు టుత్తమభక్తి స్థితి" యనియు, "జంగమోపాసనాత్మకుఁడై యుండుట భక్తియందలి కనిష్ఠత్వం"బనియు వక్కాణించినాఁడు. కలవారై మతిమంతులై యశోభరితులై భాసిల్లువారెల్లరు తొలి జన్మంబుల నీశ్వరుని గొల్చిన మహాత్ములనియు, ఖలులై వికటాకారులై, రుజాపీడితులై యున్నవా రెల్లరు నాత్మ నీశ్వరునిడని వారనియు సిద్ధాంతీకరించుకొనినాఁడు.

కర్మ, భక్తి, జ్ఞాన, రాజయోగములలో భక్తియోగంబు తక్కిన మూఁడు యోగములకుం బ్రాణమని చెప్పుటతో నాఁగక

"చావం బుట్టుచుఁ బుట్టఁ జచ్చుచు మహాచండాల సంసార పా
రావారంబునఁ గూలి తాఁ జెడుటకుం బ్రవ్యక్తిగా నాత్మలో
నేవంబొందక యేనునీవనుట తానే జ్ఞానమో శ్రీమహా
దేవా యిట్టి కుతర్కముంగలదె చింతింపంగ సర్వేశ్వరా!"

అని జ్ఞానయోగమును నద్వైతమును దెగడి "సోహంబంచుఁ దొడంగి నీకుఁ గడు దూరాత్ముం"డగును. సద్భక్తి దాసోఽహంబన్న

భవత్ప్రదార్చకుఁడు మాత్రమే సాలోక్య సామీప్యాది సత్తమరాజ్య
స్థితి పట్టభద్రుఁ డగునని శివవిశిష్టాద్వైతమును బ్రశంసించెను. శివభక్తు
లకు భవులను జూచుట కాల్మలో విరసము పుట్టుననియు, భవికి శివ
భక్తి యంకురించిన నీశ్వర బాంధవుఁ డగుననియు శివభక్తి విరహి
తుల సేవగించుకొనినాఁడు. సర్వేశ్వరుఁడగు నీశ్వరుఁడు జగము సం
తత నష్టమూర్తియై వ్యాపించి యుండినట్లే కాక బ్రహ్మ విష్ణ్వాది
సమస్తదేవతానీకము శివార్చనా నిరతమయి యున్నట్లు భావించి
తన్మయుఁడై హస్తార్పితామలకవ్యాప్తికి నీశ్వరుని దెచ్చికొన్న భక్త
లకు సాటి యెవ్వరనినాఁడు.

భక్తుఁడు మదనపిశాచావిష్టహృదయుని బోలి యనురాగంబునఁ
జూచుఁ, దలపోయుఁ, జొక్కుఁ, గాంక్షించు, వర్ణనసేయందమకించు,
సిగ్గువిడుచుఁ బ్రార్థించు, శోషించు, నిధి ధ్యాసముఁదాల్చు, దన్ను
మఱచుననియు, నన్యవిషయములందుఁ జీకును జెవిటియు, మూఁగ
యునై చరించుననియు నొకచో వివరించెను. "జ్వరసంతాప విశోషి
తాంగుఁడు సుధాసంకాశ దివ్యాన్నపాన రసశ్రేణి భుజింపరోయుగతి"
నీఁగకు దుర్గంధముగాక కస్తూరి సహ్యము గానివిధమున సంసార మద
ప్రమత్తుఁడు భగవచ్చరణారాధనయందు బుద్ధిఁ జొనుపనిచ్ఛగింపఁడని
పేర్కొనినాఁడు. శూలమునందు స్థాపితుఁడైన మానవునకాశూలము
గాలికిఁ గదలకుండుటయు సుఖముగాఁ దోఁచుమాడ్కిని సంసారజ్వా
లలఁ గాఁగువానికి బింబాధరలు హారవస్త్రాలంకారములు నించించుక
సుఖంబై తోఁచునని పోల్చినాఁడు.

"సాకస్మైచిత్ పరమప్రేమరూపా" యను భక్తి సూత్రము
ప్రకారము పరమప్రేమ కలిగియుండుట భక్తి కావున నొక దేవత
యందచంచలభక్తి కలిగియుండుట భక్తుల కర్తవ్యమైయున్నది. అట్టి
యెడఁ దక్కుంగల దేవతలును జగమంతయుఁ దన యిష్టదేవుని

యిచ్ఛానుసారము వర్తించుననియుఁ దన యిష్టదైవమే సర్వాత్మకుఁ డనియు భావించుట దోషము కాక గుణమైయుండును. కాని యాప్రేమ యితరదేవతలపై ద్వేషముగా మాఱకుండుటయు నితరమార్గముల నిందింపకుండుటయు సుగుణమును వాంఛనీయమునై యున్నది.

అన్నమయ్య పద్యము లక్కడక్కడఁ బాదపూరణ మాత్ర ప్రయోజనములగు పొల్లు మాటలతోఁ గూడియున్నను మొత్తము మీఁద ధారాళముగనుండును. కొన్నియెడలఁ దేటమాటలతో హృదయమునకుఁ దాఁకఁగలుగునట్లు చెప్పఁగలుగుటయు, మఱికొన్ని యెడల సమాసార్భటితో గుజ్జుము 'కదము' త్రొక్కునట్లు నడపుటయు నితని పద్యములందుఁ గన్పట్టును,

"కాయం బన్నది వారి బుద్బుదసదృక్షంబందు రూపింప లేఁ
బ్రాయం బన్నది శారదాంబుదతటిత్ప్రాయంబు సంపత్సుఖ
శ్రేయం బన్నది మాయ యిల్లిటఁగియున్ శిక్షించె నీధ్యాన సం
స్థాయీ భావనఁ బొందఁ డేమిటికయో సంసారి సర్వేశ్వరా!"

అను పద్యము చక్కని శయ్యతో నర్థగౌరవమును సంపాదించుకొనునది - ధూర్జటి కాళహస్తీశ్వర శతకమునందలి 'అంతామిథ్య తలంచిచూడ' ననుపద్యము పైపద్యము నీడనే నడచినది. సర్వేశ్వర శతకము తెనుఁగు శతకములలో నాదియుగమునకుఁ జెందిన దగుట వలనఁ దరువాతి శతకముల కిది కొంతవఱకు కారవడియైన దనుటలో నసందర్భ మేమియును లేదు.

"ఉరుసంసార గజేంద్ర దర్పదళన ప్రౌఢ ప్రతాపోగ్ర కే
సరి, దుష్ప్రాప శరీరబంధ విపులత్సాన్మజ ప్రజచ్ఛేద వి
స్ఫురితకూ్రర కుఠారధార, దురితప్రోద్భూత జీమూత దు
స్తర సంఘాత విఘాత మారుతము నీ సద్భక్తి సర్వేశ్వరా!"

మొదలగు పద్యములు సమాసభూయస్త్వము కలిగి ప్రౌఢముగా నున్నవి.

మనోబుద్ధి చిత్తాహంకారములను నంతఃకరణ చతుష్టయమును నాత్మయునను పంచకంబు నైక్యానుసంధానము చేయుటయే పంచాక్షరీ సుమహామంత్రి తత్త్వంబనియు, నా పంచాక్షరములు సద్యో జాతాద్యానన పంచకమునుండి యావిర్భవించినవనియుఁ, బంచభూతాత్మకమైన సృష్టికి పంచాక్షరీ మంత్రిము ప్రతీకయనియుఁ బంచాక్షరి యొక్క తత్త్వమును నావిర్భావమును వెల్లడించినాఁడు.

సర్వేశ్వర శతకమునందంతట నీశ్వరభక్తి ప్రాశస్త్యమును మహేశ్వరోత్కృష్టతయు శివభక్తుల గణనీయతయుఁ జాటఁబడినది. "బాలుండాడెడు మాటలెల్ల నుపమింపం దండ్రికిం బ్రీతిభావాలాపంబులకంటె మించుగతిఁ" దా రచించిన కృతి శివునకు రుచించుఁగాక యని కవి చివరకు విన్నవించుకొనినాఁడు.

మధురభక్తి, సఖ్యభక్తి, దాసభక్తి మున్నగు భక్తివిశేషములలో దాసభక్తి ప్రవణమైన దీతని హృదయము. ఆంధ్రి శతకమాలకొక చక్కని ప్రసూనమును జేర్చిన యథావాక్కుల అన్నమయ్య చిరస్మరణీయుఁడు. భక్తుఁడును గవియునై కవితతో భక్తిని, భక్తితోఁ గవితను మేళవించిన తెలుఁగు కవులలో నితఁడొకఁడు. "విశ్వశ్రేయః కావ్య"మ్మను సభియుక్తోక్తి ననుసరించి విశ్వశ్రేయము నుద్దేశించియే శతకమార్గమున నితఁడు కవితను నడపించెను.

"Thoughts that voluntary move
Harmonious numbers."

అని మిల్టన్ మహాకవి చెప్పినటులు తన భావములను వెల్లడించుటకీ కవి శతకప్రక్రియను జేపట్టి, భక్తిని శివానురక్తిని జాటి, తన జీవితమును ధన్య మొనర్చుకొనెను.

## పానుగంటివారి రాధాకృష్ణ

— (శ్రీ బండారు తమ్మయ్య) —

కీర్తిశేషులు శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు గారు రచించిన నాటకములలో "రాధాకృష్ణ" ప్రదర్శన యోగ్యమై భక్తిరసస్ఫోరకముగఁ బ్రసిద్ధివహించి యుండుట వలువు రెఱుంగుదురు. రాధాకృష్ణుల ప్రణయము పవిత్రమైనదను నానుడి దేశమున జిర విశ్రుతముగానున్నది. కాని గ్రంథములలో రాధాదేవి చరిత్రము యొక్క యథార్థస్వరూప మిదమిత్థమని తెలియవచ్చుటలేదు. భాగవతము దశమస్కంధములో శ్రీకృష్ణుని బాల్యచేష్టలు, లీలలు, బృందావన మండలి గోపికలతో నాతఁడొనర్చిన యనంగ కేళీవిలాసములు, రాసక్రీడలు మున్నగునవి విపులముగా వర్ణితములయి యున్నవి. ఇంచుమించుగ నీ గోపికలెల్ల భర్తలతోఁ గాఁపురము చేయుచున్న వివాహిత స్త్రీలుగనే పాఠకలోకమునకు గోచరించును. శ్రీకృష్ణుఁడు వారితో నిట్టి విహారములు గావించు నాఁటికిఁ గేవలము బాలుఁడుగాక యౌవనమునిండారిన శృంగారిగానే తలంపవలసి యుండును. భాగవతమునందుదాహృతులయిన గోపికాస్త్రీలలో రాధ పేరెచ్చటను గానరాదు. ఆమె శ్రీకృష్ణుని మేనత్త (నందుని సోదరి యా?) యను వ్యవహారముగూడ వినవచ్చుచున్నది. కాని యందుకు బలవత్తర మయిన యాకరము గానరాదు. బ్రహ్మవైవర్త పురాణములో రాధాకృష్ణుల తత్త్వము విపులముగా వర్ణితమయినట్లు, రాధాదేవి శ్రీకృష్ణ పరమాత్మకనపాయిని యగు మూలప్రకృతిగాఁ జెప్పఁబడిన దనియుఁ దెలియుచున్నది. అందలి కథ ననుసరించి శ్రీకృష్ణ దేవరాయల కాలమునాఁటి వాఁడగు చింతలపూడి యెల్లనార్యుఁడు రాధామాధవ మను ప్రబంధమును వ్రాసి ప్రసిద్ధికెక్కెను. ఈ కావ్య రచనమూలమున నాతనికి రాధామాధవ కవియను నామాంతరమే యేర్పడినది. అతని కథలో రాధాకృష్ణులు నాయికానాయకులు. రాధ బృందావన ప్రాం

తదేశ పాలకుఁడు సహస్రగోపుఁడను వల్లవరాజు పుత్రిక. వినుకలివలన శ్రీకృష్ణునియెడ ననురాగము గలిగి యాతనిని వరించి వివాహమాడ నెంచిన ప్రేయసి. భాగవతమందలి రుక్మిణీ కల్యాణ కథకు దీనికిఁ జాల పలుకుఁబోలికలున్నవి. రుక్మిణి సోదరుఁడు రుక్మివలెనే రాధ సోదరుఁడు భద్రికుఁడు రాధాకృష్ణుల వివాహమునకుఁ బ్రతికూలుఁ డయి ప్రతిఘటించును. అయినను దైవేచ్ఛచే వారివివాహము జరిగిపోవును. జయదేవునిగీత గోవిందమును బరీక్షించిన నందు వర్ణితములయిన విషయముల వలన రాధశ్రీకృష్ణుని మరగిన పరాంగనగ గోచరించును. వీరిరువుర విరహమును రహఃక్రీడలునే గీత గోవిందమునఁ జిందులాడుచుండును. గీతగోవిందమును బట్టియు రాధికాసాంత్వనముమున్నగు శృంగారప్రబంధము లందలి కథలను బట్టియే రాధ జారిణియగు పరాంగనయను ప్రవాదము పరంపరగా వ్యాప్తమయి యుండును.

పానుగంటివారి నాటకమును బట్టియైనను రాధయొక్క యథార్థ చరిత్రమున మన కెఱుకవడనేరదు. ఆమె బృందావనమున శ్రీకృష్ణుని లీలావిలాసములకుముగ్ధయై యాతనియెడ నిర్వ్యాజానురాగబద్ధయైన యొక గోపికాంగనగనే శ్రీ నరసింహారావు పంతులుగా రామెను జిత్రించినారు. ఆమె వివాహితయా యవివాహితయా యను విషయ మిందును విస్పష్టముకాదు. ఇది పంతులుగారి నాటకములలో నాల్గవది యనియు, లోకములోని వాడుక ప్రకారము రాధ జారిణీశిఖామణిగాక భక్తజనగ్రామణి యనియు, రాధాకృష్ణుల శృంగారము కాముకీ కాముక శృంగారముగాక, భక్తుఁడు భగవంతునెడఁ బఱుపు భక్తి శృంగారమనియుఁ జెప్పి యీ నాటకమునకు నాందీ ప్రస్తావనలు వ్రాసిన విద్వద్వర్యులు లక్ష్మీనరసింహారాయకవిగారిగాఢిలిమిత్రులుశ్రీ కూచి నరసింహముపంతులుగారు "కలికికివలపుల మగనికిఁగలనెయ్యము కంటె మోదకర మొండిలలోఁ [గలదే, కావునఁ గవియా,] వలపునకుం

బోల్చిచెప్పు భక్తులభక్తిన్" అని సమర్థించినారు నరసింహారావుగారు భక్తిరసోల్బణముగనే యీ నాటకమును రచించినా రనుట కెట్టి సందేహము లేదు.

ఇందలి రాధ శ్రీకృష్ణుని ప్రణయము నాతనితోడి యంగజకేళీ సౌఖ్యములకయి యాశించిన వ్యక్తిగాఁ గానరాదు. శ్రీకృష్ణుని యష్ట మహిషులలో సత్యభామ యాతనికిఁ గూర్చు వలపుఁగత్తెయైనను నామె ప్రణయము కేవలము తామసికముగ గణనీయమైనది. ప్రణ యకోప సమయముల నామె శ్రీకృష్ణుని శిరమును దనవామపాద ముతోఁ దన్ని నిరాకరించుట కెన్నఁడు నొక్కింతయు జంకుగొంకులు లేని జాణగనే యామె గ్రంథముల కెక్కి ప్రజల నోళ్లలోఁబడినది. పారిజాతాపహరణము తత్ఫలితముగనే వెలసినది. సత్యభామ తమః ప్రవృత్తికి శృంగభంగము గావించుటకు, "రాఘవత్వేభవేత్సీతా, రుక్మిణీ కృష్ణ జన్మని" అనునట్లు విష్ణుమూర్తి కనపాయినియైన లక్ష్మి దేవి యవతారమూర్తిగా భాగవతమునఁ బ్రస్తుతికెక్కిన రుక్మిణీదేవి (కృష్ణుని యగ్రమహిషి) వలంతి కాఁజాలదయ్యెను. శ్రీకృష్ణ తులా భార కథమాత్రము రుక్మిణీదేవి నిర్మలభర్తృభక్తికిఁ దార్కాణముగా వెలసినది. సత్యభామ తామసిక భక్తి ప్రవృత్తులకుఁ బ్రతిస్పర్థిగా రాధాదేవి ముగ్ధవినిర్మలభక్తిని నిలిపి యామెకు శృంగభంగమును, మానసిక పరివర్తనమును గలిగించు మహోత్తమాశయముతోడనే రాధాకృష్ణ నాటకమును పంతులుగారు రచించినట్లున్నది. ఈ నాట కమునందలి యంకము లయిదు. రంగస్థలములు,మధురాపురము, బృం దావనము రెండుమాత్రమే. పాత్రములుఁ గూడ స్వల్పమాత్రము లే. కృష్ణుఁడు నాతని విదూషక మిత్త్రుఁడు శారదుఁడు, నారదుఁడు నాతని శిష్యుఁడు,మునిబాలకుఁడునలువురు పురుషపాత్రములు. రాధ యామె చెలికత్తెలు, లలిత, మధుర యను నిరువురు, సత్యభామ, ఆమె

చెలికత్తెతరళ, స్త్రీపాత్రములు. బాలకృష్ణుని లీలామానుష విగ్రహమును గాంచి యానందించుటచేఁ గనుకలివలననే యీ నాటకమందలి నాయికయైన రాధ శ్రీకృష్ణునియెడ బద్ధానురాగయైనది. అతని సాన్నిధ్య సౌఖ్యమునే కేవల మపేక్షించిన సాత్త్విక ముగ్ధ భక్తురాలిగా నీమె యిందుఁ జిత్రింపఁబడినది. తక్కిన గోపికలవలె శ్రీకృష్ణునితోడి యనంగకేళీ సౌఖ్యముల నామె యాశించినట్లు కనరాదు. శ్రీకృష్ణుని యాగమనము నిరీక్షించు సందర్భమున నాతనికయి యమర్చిన కుసుమశయ్యపై తనచెలికత్తె లలిత శితాగ్రములగు జాజి మొగ్గలుదెచ్చి దాచిన కారణమున శిరీషకుసుమసుకుమార శరీరుఁడగు నాతని దేహముననవి గ్రుచ్చుకొనుననెడి వగపుతో రాధ లలితను "నీకు శ్రద్ధ యున్నంత తెలివిలేదుసుమా!" అని తెగడు వాక్యముతోడనే ప్రథమాంకము ప్రారంభమైనది. అటు తరువాత వారిరువురకు జరగిన సంభాషణ సల్లాపములను పంతులుగారు తమ సహజ నైపుణ్యముతోఁ జమత్కారముగఁ జిత్రించిరి. భావికథా నిర్వహణమున కనుగుణముగఁ బాత్ర సంభాషణములఁ గడుసుఁదనముతో సంతరించుటలో వీరి నైపుణ్య మగణ్యమనుట సుప్రసిద్ధము గదా!

"రాధయొక్క ప్రాణములు శ్రీకృష్ణునిలో నున్నవని జనులు చెప్పుకొనుటలేదా! తన ప్రాణముఁ దన దేహముఁ దన సర్వస్వము నతనికిఁ ద్రికరణశుద్ధిగా నర్పణము చేసికొనిన పరిచారిక యని చెప్పుకొనుటలేదా" అనియీ సంభాషణములలో రాధ యారాటముతో లలితను బ్రశ్నించును. మఱియు జనులవాక్యములతోఁ దనకు బని లేదనియు సమ్మోహమహునికున్న పదునాఱువేల భామినులలో రాధ కూడ నొక భామినియే యనియైనఁ జెప్పుకొనుచున్నారా! అందులోనైనఁ దనకుఁ గొంత యాధిక్యమును జనులాపాదించుచున్నారా

యని యాత్రిముతో నడుగును. వీనిని బట్టియే యామె ప్రేమస్వరూపము గోచరమై యామెకు శ్రీకృష్ణునిపయి గల భక్త్యనురాగములు కేవలైహిక వాంఛాపరములు గావనియు నామె సాత్వికభక్తిసంపన్న యగు ముగ్ధయనియుఁ దెలియఁగలదు. గత రాత్రిమున జరగిన సమావేశములో మఱునాఁడు చంద్రోదయవేళకు మరలవత్తునని శ్రీకృష్ణుఁడొనర్చిన వాగ్దానమునుబట్టి చంద్రోదయమునకై యామె యారాటపడుచుండెను. చంద్రోదయ మయ్యెనుగాని శ్రీకృష్ణుఁడు రాకుండుటచే నామె కాశాభంగమయ్యెను. కొంతసేపటికి కృష్ణుని వేడుక చెలికాఁడు శారదుఁడు మాత్రి మేతెంచెను. శ్రీకృష్ణుని వెంటఁబెట్టుకొని రాక శారదుఁ డొక్కఁడే ముందువచ్చుటకు వగచుచు జరగిన జాగునకుఁ గారణముల నారయు నవకాశమున నామెకు శారదునికి జరగిన వాక్యోపవాక్య సంభాషణ మతిమనోహరముగఁ జిత్రింపఁబడినది. తారావళియను గోపికతోఁ గ్రీడించిన యనంతర మెట్టకేలకు శారదుఁ డచ్చటినుండి మరలకముందే కృష్ణుఁ డేతెంచెను. తారావళి కేళిలో నొనర్చిన నఖక్షతాదిక చిహ్నము లాతని మొగముపైఁ గాంచి యవి యేమి యెవరీ దుండగ మొనరించిరని రాధతత్తఱము తోఁ బ్రశ్నింప శారదుఁడు "అమ్మా! నీ నాథుఁడు ప్రాణమిచ్చుటనుంచి యొక్క యొడలితో మాత్రిమే యచ్చటికి వచ్చినందులకుఁ దారావళి యతని యంగీకారముపైఁ జేసిన శిక్షా చిహ్నములు" అని బదులు పలుకఁ దాను వానిని జూడఁజాలననియు,తన హృదయము కరగుచున్నదని, యసూయచేతఁ గాదని, మృదులాంగుళులచే మెల్లగ స్పృశించు మాత్రిముననే వాడునతిలలితములగు నాతని గండము లెంత బాధింపఁబడినవని యిత్యాదిగా వాపోవుచు "ఇట్టి యవస్థలోనే నీతనిఁ జూడఁజాలను. లలితా నా కింటికి దారిచూపుము" అని రాధ యచ్చటినుండి వెడలిపోవుటకు సిద్ధమయ్యెను. 'ఫలముఁ గోరిన యను

రాగకలనఁ గలుగు! దానికి నసూయ యుండునుగాని నిష్ఫలాభిసంధిని శోభించినట్టి రాధ, చిత్తము నసూయ యెన్నఁడుఁ జెనకరాదు" అని కృష్ణుఁడు తనలో ననుకొని యామె నిష్కామానురాగమును బ్రశంసించి "రాధా! నన్నుఁ గటాక్షింపుము" అని యామె నిర్గమనమును వారింప నెంచును. కాని "అచిహ్నములుండుదనుక నాకన్నులు నిన్నుఁ జూడఁజాలవు. క్షమింపుము. నమస్కారము. నేను పోయెదను. లలితా రమ్మ" అని లలితతో నామె రంగమునుండి నిష్క్రమించును. "వాయులహరిని వెన్నాడు పరిమళంబు గతిసి" కృష్ణుఁడును, "వారణము తోఁడివాలమువలె నేను నీ వెంటనే వత్తు" నని శారదుఁడు పలుకుచు నిరువురు గూడ నిష్క్రమించుటతోఁ బ్రథమాంకము ముగియును.

రాధాకృష్ణుల నిర్మలానురాగాతిశయములు, సంబంధములు, నామెచు జూచుల కయి కృష్ణుఁడు తమ్ము వీడి మధురాపురమునుండి బృందావనమునకుఁ దఱచు రాకపోక లొనర్చుటయు సౌందర్యగర్వితయుఁ దామసమూర్తియునగు సత్యభామకుఁ గర్ణాకర్ణికగఁ దెలియవచ్చెను. సహజముగ నామెకు రాధపయి నసూయ హెచ్చెను. తన యాజ్ఞాపాశములఁ గట్టునదు కృష్ణు నిఁక బృందావనమునకుఁ బోనీయఁ గూడదని యామె నిశ్చయించుకొని, బృందావనమునుండి మథురకు, మథురనుండి బృందావనమునకు నటనుండి మథురకు రాకపోకలు నెఱపుచు రాధయొక్క స్థితిగతులను గృష్ణునకు నివేదించుచుండు శారదుఁ డేతెంచిన వార్తఁ దెలిసి కబురుచేసి తన యంతిపురమున కాతని రప్పించెను. రాధ విషయమున సత్యభామయు నామె చెలికత్తె తరళయు శారదునితో వాక్యోపవాక్య సంభాషణములు జరుపుచున్నతఱి శ్రీకృష్ణుఁ డచటికేతెంచి శారదునిఁజూచి యెప్పుడు వచ్చితివని ప్రశ్నించును. బృందావనమునుండియే యాతఁడు వచ్చెనని యచ్చటివారి క్షేమాదిక వృత్తాంతముల నడుగుచుఁదన పెంపుడు తల్లి

దంద్రులు (యశోదానందులు) తనకై తపించుచుండిరా? తనను తీసికొని రమ్మని వారే నిన్నిటకుఁ బంపిరిగదా యని చమత్కారముగఁ బ్రశ్నించును. శారదుఁ డందుపయి "ఇది గురుజనాజ్ఞ (అపవారించి) కాదు గురుజఘనాజ్ఞ, రాధా సందేశము" అని సమాధానమిచ్చును. రాధా స్మరణముచేఁ బులకితుఁడయిన మగనిఁగాంచి సత్యభామ "నాథా! నీ మోమిప్పుడు నూత్నవికాసముచే శోభించుచున్నదేమి" యని సాసూయముగఁ బృచ్ఛించెను. కృష్ణుఁడును దనలోఁ "రాధ యను సుధా మధురాక్షరములు చెవిఁబడిన వెంటనె మనసెంత ప్రభను జెందెనో క్షమాఱుఁగఁ దటుకునఁ జుక్కరాలుఁ ప్పునను వెల్గునమవస రాత్రివోలె" అనిహర్షించి, ప్రకాశముగా "ప్రేమకును స్థానమగువారి క్షేమమెఱుఁగ సౌమనస్యంబు నాకు నాశ్చర్యమగునె! తూర్పు తెల్లవాఱిన శోభ తొలుతఁగాంచఁ బొద్దుతిరుగుడుపువ్వు సమ్ముదమగునదె" అని సమాధానమిచ్చును. అంతతో మఱింత మండిపడుచు, "సత్యభామ నీవు ప్రేమించు వారచ్చట నున్నప్పు డిచ్చటివారెవ్వరు. శత్రువులా ఆహా! ఎంత వగకాఁడవు. నన్నెంత మోసముచేసితివి." నీవు నన్నే ప్రేమించితివని పొంగిపొంగి బోరగిలఁబడితినే! ఇట్టిదేనా నీ యనురాగము" ఇత్యాదిగా నెన్నెన్నియో నిష్ఠురోక్తులాడి కృష్ణుని మనము నొప్పించి యాతఁ డెంత బతిమాలినను గోపము విడువక. యాతఁ డెట్లును రాధ కడకు బృందావనమునకుఁ బోవకుండఁడని తలంచి తానుగూడ నాతనికిఁ బ్రచ్ఛన్నముగఁ దరళతో బృందావనమున కేఁగి యాతఁడు రాధతో నెట్లు కులుకునో కనిపెట్టెదనుగాక యని నిశ్చయించుకొని కోపముతోఁ దటాలున నాతనిని విడిచి వెడలిపోయెను. ఆఱుమాసములనుండి యాహారము లేక, కదలిక లేక, నత్తగుల్లవలె నతి మంద స్థితిలో రాధయున్నదని శారదునివలనఁ దెలిసి యామెను జూడనిఁకఁ బోకతప్పదని నిశ్చయించి, కృష్ణుఁడు సత్యభామ కోపశాంతినొందవయ్యెనే

యను విచారముతోడనే బృందావనమునకుఁ మరలుటతో ద్వితీయాంకము ముగియును.

తృతీయాంకమున నంతర్నాటికను గూడఁ గల్పించి పంతులుగారు దాని నతి నిపుణముగ నిర్వహించినారు. అనుమానములనుండి విరహమున వేగుచున్న రాధను ద్వరలో రానున్న శ్రీకృష్ణునితో భాషించి యుపచరింపవలయు విధానమున కాయత్త పఱిచెదమన్న నెపమున నామె చెలికత్తెలలో లలిత శారదుని వేషమును, మధుర శ్రీకృష్ణుని వేషమును, రాధ తాను రాధగనేయుండి రాధ పాత్రమును ధరించి యుపవనమున నీ యంతర్నాటక మాడుదురు. ఇంతలో శారదసహితుఁడయి రాధ నాదరించు కుతూహలముతో శ్రీకృష్ణుఁడు రంగమున కేతెంచి యొక పొదరింటనుండి విలోకించుచుండును. వారికిఁ గనరాకయే యంతలో సత్యభామయుఁ దరళయు మధురనుండి వచ్చి యటనొక లవంగ నికుంజమున డాఁగి తాముగూడ నీ నాటకమును బాత్రి సంభాషణములను గాంచుచుందురు.

శ్రీకృష్ణ పాత్రమును ధరించిన మధుర రాధయెడఁ గృష్ణునికి గల విరాళి నభినయించుచు

"ఒడలువడకెడు గడగడ నడుగులు తడఁ
బడఁయె నతి పారవశ్యంబు పరిఢవిల్లెఁ
గరుణ భవదీయ బాహువల్లరుల నన్ను
గట్టిగా సౌఖ్యమెనయఁగఁ బట్టికొనవె"

అని రాధను సమీపింపఁబోవ శారదుఁడు కృష్ణునిజూచిఁ "మిత్రమా! ఇఁక నుపేక్షింపఁగూడదు. పాత్రత్వము మిగిరి పతిత్వములోఁ బడుచున్నది." అని పలికి మధురను వారించుటకయి హెచ్చరించును కృష్ణుఁడు నవ్వుచు "తొందరలేదు. మధురయిప్పుడన్నది మాయమాట. పాత్రమున కంత రసోదయముండునా" అని శారదునితోఁ బలుకును.

ఈ మాటలు కృష్ణునినోట వినినంతనే సత్యభామ కనలి కృష్ణునకు రాధయెడఁగల రసోదయము తత్పాత్రధారిణియగు మధురకట్లుండునను నాతనివాక్యమును బట్టి తన నాథునకు గయ్యాళియు, జారిణియునగు రాధచే నెట్టి దుర్గతి పట్టినదని వెచ్చనూర్చుచుఁ దరళవైపు విలో కించును. ఇంతలో శారదుని పాత్ర వహించిన లలిత కృష్ణపాత్ర ధరించిన మధురవైపు చూడ్కి నిగిడ్చి, "మిత్రమా! అత్తింటి యల్లునకు భోజనపాత్రయొద్దవలె రాధ యెదుట సిగ్గేల ? ఆలసింపకుము." అని హెచ్చరింప. మధురయు "రాధా! ప్రియప్రియా', అని యామెమీఁద దన చేయి వేయును. అది చూచి శారదుఁడు "అయ్యో! మిత్రమా! చూచితివా యీ చానినకూఁతుర సాహసము. ఇప్పుడైన వేగిర పడ వయ్యా!" అని కృష్ణుని మఱింత హెచ్చరించును. దానిపైఁ గూడఁ గృష్ణుఁడు బయటపడి రాధనుసమీపింపక, మధురను గూర్చియే రాధ నుగౌఁగిలించిన యామె భాగ్యమును ప్రశంసించుచు -

"మధురా! రాధను కౌఁగిలించితివి కదా

"నీవు చేసిన యీపని నీకు ముదమె। సంగడైనను నాయెడల్ జల్లుమనియె। జ్ఞానిచేసిన కార్యంబువానికేమి। కార్యమొసఁగదు లోకోపకారమగును। ఈవు కృష్ణుండవని రాధ యెంచుకతనఁ। గృష్ణు పరిరంభసౌఖ్యంబె యెనసెరాధ। విగ్రహామె దేవుఁడని భక్తివిశ్వసింపఁ। దైవసాన్నిధ్య సౌఖ్య మందంగ నరుదె"

"వడివడిగ నీవు రాధాంసభాగమందు।వర్తిలుచు నున్నతోన్నత పదవి గాంచి।వెలసితివి యేను పొదలోన మిడుకుచుండఁ।దరుణి హాస్తమ! నాకంటె ధన్యవీవె" అని సంభాషించెను -

ఈమాటలు విని సత్యభామ మఱింత గగ్గోలువడి "అహా! దాసి, నీచ సేవాపరిహీనయగు దాసి, నెత్తిపైఁజిల్లిగవ్వఁ బెట్టిన నంతయైన విలువచేయనిదాసి, అట్టిదాసియొక్క (రాధచెలిమధుర) హాస్తమే

నానాథుని కంటె ధన్యయఁట. వింటివా! అతఁడెంత దైన్యమున కొడం బడెనో! ఛీ! ఎంత మానహీనమైన మాటాడెనో! అనఁగూడదు కాని యెక్కడఁ బెరిగెనో అక్కడి బుద్ధులు, అక్కడిమాటలే వచ్చును గాని ... " అని గొల్లఁడగు నందుని యింటఁ బెరిగిన యాతని హైన్యమును గూడ నెత్తిపొడువ నుంకించెను.

"అమ్మా! మగవారి మాటలు మర్యాదలు సమయోచిత ములే కాని స్థిరములు కా"వని తరళ యూఱడించును.

ఇంతలో మధుర "మగువ నునుఁజెక్కునకు సొమ్ము మగనిముద్దు" అని రాధను ముద్దుఁగొనఁబోవ నామె మొగముఁ ద్రిప్పుకొని విదలించు కొని దూరముగఁ బోవును. అదిచూచి శారదుఁడు "సంతర్పణ మైన తరు వాతవెళ్ళిన బ్రాహ్మణున కెంత సన్మానమో నీకు నంత జరుగఁదలంచి యున్న"దని కృష్ణునితోఁ బలుకును-

"విద్యుదుద్ధత వస్తువు వెలయు నొక స్వజాతి శక్తిర్థమగు దాని సరసఁజేర్పఁ బడిన నది దూరమౌభంగి వనిత మధుర విడిచి తొలఁగె నదృష్టవంతులము మేము" అని సంతసించును.

అంతట శారదుని వేషమునసున్న లలిత "కృష్ణా! ఇటురా" అని మధుర నుద్దేశించియే పలుకఁగా వాస్తవకృష్ణుఁడే ముందునకు నడ చును. శారదుఁడు నతని కూడ నరిగెను. ఈ దృశ్యములఁ జూడఁగా సత్యభామకుఁ గనులలో నిప్పులు పోసికొనునటు లయ్యెను. కనుపు మండుకొని పోయెను. "నేనుగూడ నాతని (కృష్ణుని) వెంటఁ బోదునా అని తత్తఱపడఁ దరళ తొందర పలదని వారించెను. కృష్ణుఁడు, శార దుఁడు రాధాదుల యొద్దకేఁగిరి. కృష్ణుఁడు "రాధా! చిత్రమైన బొమ్మ లాట నాడించితివే" అని యెగతాళి చేయును. "అమృతమును బొందు నరునకు నన్నమేల! భక్తిగలుగంగ నైహికవాంఛ యేల?! లోకనాథుఁడు కనబడ లోకమేల? ! మధురనాథుండు నిను గోర మధుర యేల?"

అని యీతఁడువలుకు రాధ నమస్కరించును. "సుమంగళీ భవ" యని కృష్ణుఁడామెను నాశీర్వదించును. రాధయు నిష్ఫలమైన శ్రమము గల్గించిన యపచారమును మన్నింపవలెనని ప్రార్థించును. మఱియుఁ దన్ను వలపించిన ప్రాణనాథుఁడు, ఇష్టదైవము బృందావనాధీశుఁడు గాని మథురానాథుఁడు గాఁడని వెల్లడించి, కావున-అను నర్థోక్తితోఁ జెలఁగు మొగమున కడ్డువైచికొనును. కృష్ణునకుఁ బ్రశస్తమగు శృంగ భంగమైనదని శారదుఁడు తనలో ననుకొనును. ఈ మాటలచే రాధను నెఱజాణగా నెంచి సత్యభామ యీమె బృందావనములో దన్ను మెడ గట్టికొనితిరుగక మథుర కేలపోయితివి? ఇంతకాలమఁట సత్యభామతో గాఁపురమేల చేసితివి? మథురావాసము చేయుటచే బృందావనమునుండి తన పరిరంభమునుండి కృష్ణుని బహిష్కరించితివని యీ మాయలాడి కృష్ణు నెత్తిపొడుచుచున్నదని వ్యాఖ్యానముచేసి యీమె యందు మఱింతకినుక వహించును. రాధ భక్తిపారవశ్యమునకు లోలోన నాశ్చర్యమంది కృష్ణుడు పరిహాసముగా రాధ యభిప్రాయమేమని ప్రశ్నించును.

సీ॥ వేత్రలు గుచ్చిన వివిధప్రసవమాలికాతతి సిగచుట్టు గలుగువాఁడు
ఒకచేతమురళివేఱొకచేతనవనీతకబళమింపులుగుల్కఁగలుగువాఁడు
మీఁగడజిడ్డుల మెఱుగారు లేతచెక్కులమందహాసంబుగలుగువాఁడు
జ్ఞానికైనననందగారానిచిఱుపాదములనుబంగరుగజ్జియలలరువాఁడు

గీ. పుట్టతేనె రాధ మోవియు నొకరీతి
నాడిసి భళియని తల యూఁపువాఁడు
ఇట్టిలేతవాఁడు బృందాధి నాథుండు
ప్రభుఁడు గురుఁడు ప్రాణపతియునాకు

గీ. మణికిరీటాంగదాది హేమప్రసాధ
నములు నినురాజుగాఁ దెల్పు; నాదు మగఁడు,

ధరణినాథుఁడుగాఁడు రాధామనంబు
కొల్లగొన్నట్టి కడు లేఁత గొల్లవాఁడు"

అని సమాధాన మొసంగి, "మహాప్రభో! క్రిందటిసారి నాకు దర్శన మిచ్చునపుడు లోక సమ్మోహన బాలకాకృతితో దర్శన మొసంగితిరి. ఇప్పుడిటు లేల వచ్చితిరి?" అని ప్రశ్నించును. "రాధ ముదిరినాఁడనని నిరాకరింపఁ । గౌఁగిలించుటకంటెను గాఢమోద। మిప్పుడొందితి రాధకు నిష్టదైవ।మిట్టియేఁగాను చిననాఁటి యేనుగాని" అని కృష్ణుడు తనలో సంతసించును. ఇది యంతయుఁ గాంచి చాటున నున్న సత్యభామ రాధను బలువిధములఁ దెగడి మెటికలుఁ విఱుచును. తుదకు రాధ కృష్ణు నుద్దేశించి

"మథురానాథా !

"లోకమందలి వార్తలునాకుఁగావు।నీవొసఁగునైహికైశ్వర్య నిఖల వితతి। నాకుఁ గొఱగాదు నీబాలకాకృతిని వ। రించితిని నిష్టమైనఁ జూపించుదాని।కానియెడ నీమహారాజ్యగాఢపదవి।వలనఁ గలిగెడు నైహికములకు నిన్ను । వలచు వారల దరిజేరి వారిఁగావు। మిట్టి నీ రూపు నాకు రుచింపదయ్య।"

అని విస్పష్టముగ ప్రకటించును. "రాధ యెంత గయ్యాళి, యెంత వదరుఁబోతు, ఈ మాటలెల్ల నాకు శూలపుఁబోటులు కావలెననియే యిట్లు వదరుచున్నది." ఇత్యాదిగా సంభావించి నాథుని మెత్తదన మును జూచియే యిది యిట్లు పేలుచున్నదని, కఱకు పదనువాఁడై కొప్పుచేతఁ బుచ్చికొని యీచెంప నాచెంప వాయించువాఁడైన నోరెత్తునా" యని సత్యభామ మిక్కిలి కుములుచుండును. శారదుఁడు రాధను జూచి "అమ్మా! బృందావన గోపాలుఁడుగాని, మథురా నాథుఁడు నీపతి గాఁడని యీతని నిరాకరించితివే?అతఁడైనఁనితఁడైనఁ గృష్ణుఁడే కదా! ఆతని వేషముతో నాటకమాడిన నీచెలి మథురకంటె

నితఁడు చెడిపోయినాఁడా! ఆమెనుమగనిగ భావించిన నీవు కృష్ణుఁడైన యీతని నట్లు భావింపలేవా" యని ప్రశ్నించును. మధుర నేనెట్టి మూర్తిని వరించితినో యట్టిరూపమున నేనాకు ప్రత్యక్షమయ్యెను.' అని రాధ సమాధానమొసంగఁ గృష్ణుడు "ఇప్పుడుగూడ మధురయట్లు లేకనఁబడుచున్నదేమో చూడు"మనెను. మధురవయిపు దృష్టి నిగిడ్చి యామెయందా యాకృతినిగానక రాధ "ఏమే మధురా! ఇంతకుముందు నీవు వహించిన బాలకృష్ణత్వ మేదీ"యని ప్రశ్నించును. నీనాథునకే యర్పించితినని మధురబదులు పలుకును. అంత నేనిప్పుడీమెకు బాలకాకృతితో సాక్షాత్కరింతునని తనలోఁ జింతించి కృష్ణుఁడు

"చెలువ వాల్గనులను గటాక్షించు నెపుడు
నీఁడఖిల జగన్మోహన బాలలీలఁ
గలుగు రాధాధినాథుడో కాక ముదిరి
మోటయిన సత్యభామా వధూటిపతియొ"

అని బహిరంగముగఁ బ్రశ్నింపఁగ రాధచూచి "హా! నీవు నాకాంతుఁడవే కృష్ణా!"యని యాతని కాళ్ళపైఁ బడును. ఈదృశ్యముఁ దిలకించి సత్యభామ సహింపఁజాలదయ్యెను. లవంగ నికుంజమునుండి తొందరతో నామె తరళతోఁ బ్రవేశించి కృష్ణునెదుట నిలువఁబడి "నేను ముదిసిన దానినా ? మోటగుదానినా! నీకీ బానిసనవనవలాడు పడుచు కూచి యయ్యెనా! నేను దవదవలాడు ముసలి నైతినా! పశువులతోఁ బెఱిఁగిన యీ గొల్లభామ నీకు నాగరకత గలదయ్యెనా ! మహారాజపుత్రిక నెండ కన్నెఱుఁగని నే నడవిమృగము నైతినా! ఇది నీ కప్పరసయే యగుగాక! నేను కురూపినేయగుదునుగాక. కులకాంతనైన నా పేరీయధమురాలియొద్ద నీవేల తలపెట్టవలెను ? వలదు వలదని చెప్పలేదా! బుద్ధిలేదా!"అనిపలువిధముల నాతనిని దూలనాడెను. ఆమె మథురాపురమునుండివచ్చియుండినవార్తనెఱింగియునీనాటక మాడించు

చున్న యామాయాసూత్రధారి యేమియు నెఱుంగనివానివలె నవ్వుచు "సత్యా!నీ వెపుడు వచ్చితివి! నేనన్న మాట లెట్లు వింటివి? నీవుముది సితివనిమోటుగా నుంటివనినేనంటినా! ఎందుకీ కోపము ? నేనటులంటి నని నీకర్థమైన యెడల నన్నుక్షమింపు మిదిగో! ప్రణమిల్లెద"నని నమ స్కరింప నామె రోషముతో నాతని తలందన్నును. ఆమె ధూర్తవర్తన మును జూచి రాధ గుండెలు బాదుకొనుచు "హా! కృష్ణా! హా! కృష్ణా!' యని యంగలార్చును. పారిజాతాపహరణకథ యందువలెనే కృష్ణుఁడు సత్యభామా పాదప్రహారమును శిరోలంకారముగా సంభావించి ఆమె కోపమును శాంతింపఁజేయుట కనునయములు వలుకును. "ఎంత మహా పచారకృత్యమును నాపాపపు నేత్రములతోఁ జూడవలసి వచ్చినది. అక్కా!అక్కా!"అని రాధ సత్యను సమీపింప నామె "ఎవతెవే నీవు? నీకంటె నేను పెద్దదాననా! నానాథునితో నీవుగూడ నన్ను ముదు సలినని యాక్షేపించు చుంటివా!" అని మండిపడును. అంత రాధ "లేదు చెల్లెలా! నీవు నాకంటెఁ జిన్నదానవే యగుదువు. కాని అయ్యో యెంత? యెంతపని చేసితివి. నీవు చేసిన పనికి నాథుని కుడిచెవినున్న నల్లగలువ మకరందమనుపేరఁ గన్నీరు విడుచుచున్నది. చూడు నా కడుపు దఱుగుకొనిపోవుచున్నది. నున్నగ ముడిచినసిగనుండి పీడి జాజిపూలెట్లు చెల్లాచెదరైనవో చూడు. వానిని గన్నుల కద్దుకొన వమ్మా." అని చెప్పుచుఁ బుష్పముల కన్నుల కద్దుకొని కృష్ణుని శిర ముపైఁ జల్లును. దానిపై సత్యభామ "ఛీ. స్వైరిణీ! సిగ్గుమాలినదానా! నాపెనిమిటితో నా యెదుటనే సరసమా! అతని సిగనుండి పూలు జాతీసవా! ఇదివఱకే నేలరాలియున్న పూల నాతని సిగలో ముడుచు చుంటివా ? పూలచెండ్లను గూడనింక నాతనితో నాడెదవా ? కుల కాంతనగు నాకుఁబతివ్రతాధర్మములు చెప్పుచుంటివా. కాంతుని కను రాగ పాత్రిమనని గంతులు వైచుచుంటివా ? శారదునిచే రాయ

చారములేమి ? అర్ధరాత్రిమునఁ బుష్పవనమున విహారములేమి ? నాటకములేమి ?ఈ తైతక్కలేమి? సిగ్గులేదా ? సంసారిణివికావా ? నాసంసారమును భగ్నమొనర్తువా? ఏమి చేసెదనో చూడు జాగ్రత్త. ఒడలు తెలిసికొని వర్తింపుము.'' అని గద్దించును. ఆమె మాటలను విననట్లే రాధ కృష్ణునిపయి దృష్టిఁ బఱిపి, "నాథా! నీతల నొచ్చుచున్నదా! ఒత్తుదునా! విసరుదునా!''అనిపలుకుచు సత్యనుజూచి"చెల్లెలా ఇది న్యాయమా! పద్మరూలాపరాగ ధూసరితమగు నాథుని కేశపింఛము పాదపరాగ పాంసుల మగునట్లు చేయఁదగునా! నేనాతని దాసురాలను. అతఁడొక్కఁడే బాధపడుచుండుట నే భరింపఁజాలను. చూడలేను. నేనును నీకుఁ బ్రణమిల్లుదును. నన్నుగూడఁ దన్నుము.'' అని యామెకుఁ బ్రణమిల్లును. తానెంత తిట్టిన నంత శాంతమూర్తియై సౌమ్యరూప యగుచున్న రాధ శీలమునకు మనస్సులో నాశ్చర్యమొందుచు "అమిత సౌందర్యవతినను గర్వము, నేనే కాంతుని మిక్కిలిగఁ బ్రేమించుచున్నాననుగర్వము, ఈమెను జూడఁగ నశించుచుండుటయేగాక యీామె నాచిత్తమునే యాకర్షించుకొనునట్లున్నది. ఇది యేమి మాయయో!ఛీ!ఏమయిన నేమి ? దీనికి నేనులోఁబడుదునా!'' అని లోలోన వితర్కింపఁ దొడఁగెను. రాధాసమక్షమున సత్యభామ మానసమునఁ గలుగుచున్న పరివర్తనము కృష్ణున కవగతముకాఁగా నతఁడు తనలో "తన్ను మించినసుందరి ధరణి లేదటంచుఁ దనకంటె మగనిపై నధికరాగ ముమన్నసతి లేదనుచు గర్వమున్న దీనిగర్వ మించుక శాంతించెఁగాని నోటి, బింకములు దీనికింకను విడువకుండె'' అని చింతించెను. రాధయు మరల "ప్రాణనాథా! "బడలి నా కుచమండలభాగ మందు। నీవుతలయుంచి నిదురింప నీదుశిరము। నొచ్చునని నాదు మెడ లోని నూత్నమల్లి।కాసరం బడ్డుచేసితిఁ గాదె కృష్ణ!'' అని యాతనితో సానునయముగ వచించును. "ఛీ! స్వైరిణివైన నింత స్వచ్ఛందముగఁ

బలుకదు. ఎంత హద్దుమీఱితివి? ఎంత నిరంకుశముగ నుంటివి? చేయుకృత్యము ఘోరపాపకరమని యైన నెఱుఁగవా! ఛీ!మగఁవారల చెవిని బడునేమోయని నలుసంత భయమైన లేదా! సిగ్గు లేదా!" అని రాధనుజూచి సత్యభామ మఱల గద్దించును.

"మఱొక మగవాఁడెవఁడు లోకమున లేకపోవుటచేతనాకు సిగ్గు లేదు. మనమగని యెద్ద మనకంత సిగ్గేల యుండవలెను." అని రాధ సమాధానమొసంగ "ఓసీ! మతిమాలినదానా! అదేమి! మఱొక మగవాఁడే ప్రపంచమున లేఁడా!" అని సత్య కోపముతోఁ బలుక "మనకాంతుఁడు తప్ప మఱి యెవరున్నారు? సృష్టియందలిజీవతతి యంతయు స్త్రీతతియే. అందఱకు నాథుఁడొక్కఁడే పురుషుఁడు" అని రాధ నిర్భయముగ మాఱుపలికెను. "సర్వసంసారచ్ఛేదకరమైన యీ దిక్కుమాలిన పాడువేదాంతము నాకొంప దీయుటకు నీకెక్కడనుండి లభించినదే? దైవమా! ఈచుప్పనాతి రాకాసి,పిశాచి నాకెక్కడ దాపురించెను? అని వగచుచు రాధమీదఁ జూడ్కిఁబఱిపి "ఓసీ! యింకనీవు నాపతికి రాయబారమంపినను, లేఖలు వ్రాసినను, అతని పేరెత్తినను నిన్నేమి చేయుదునో చూడు" మని ధిక్కరించుచు, మరలఁ గృష్ణునివైపు మొగంబిడి "నాథా! ఇంతకు దానినననేల! నన్నిక్కడకుఁ దీసికొనివచ్చి నామొగమైనఁ జూడక, నాపాడయైనఁ గిట్టక నాయెదుటనే యీ సంసారఘాతినితో, యీలజ్జాపరిత్యాగినితో నాయెదుటనే నాపాపపుఁ గన్నులు మండుచుండగనే దానితోఁ గులుకుచు, సరసమాడుచుఁ గెవ్వమనుచు మీఁదుమిక్కిలి యడ్డమైన మాటలు నీవనుచు, దానిచే ననిపించుచు నిట్లు గౌరవభంగము, గర్వప్రాయశ్చిత్తము చేయుట చాలదా! ఇంక నిక్కడ నేనెంత సేపుండవలెను? ఒక్కక్షణమైన నిట నుండఁజాలను. ఈ క్షణము నావెంట మథుర కేతెంచెదవా? లేక నీ యెదుటనే యీ యమునలోఁబడి ప్రాణత్యాగ మొనరింపుమనెదవా" అని యాతనిని

జుఱజుఱఁజూచుచు, రాధనుగాంచి "ఏమే! నానాథుని వంకఁ జూచెద
వేమి? ఆతని నాగుమని కనుసన్న చేయుచుంటివా! నేనీ యమునలోఁ
బడి చచ్చినయెడలఁ బీడయే వదలునని మురియుచుంటివా! నేను చచ్చి
యైన నిన్ను సాధింతును. వింటివా! నీయాటలఁ గట్టిపెట్టుము." అని
గద్దించుచు మరలఁ గృష్ణుని మొగమయి "నాథా! రావా! నాకంటె నీకు
రాధ యెక్కువ యయ్యెనా! నట్టడవిలోనికి నన్ను ట్లీడ్చికొనివచ్చి యీ
రీతిగ నేడ్పించుట నీకు న్యాయమేనా! నేనేమి తప్పు చేసితిని? నిన్నిం
తగా ప్రేమించినందులకిట్లు చేసెదవా" అని మనసుకరగునట్లు నేడ్చును.
"ఇంతవఱకుఁ బాడిన సంగీతమున కీమాత్రపు మంగళహారతి యావ
శ్యకమే." యని శారదుఁడుతనలోఁ బరిహసించును.

శ్రీకృష్ణుఁడును దనలో "ముదితపూర్ణానురాగసంవిదితయగుచుఁ
బులుకుపులుకునఁ గన్నీరులొలుక మనసు । కలుకుమనియెను: ప్రియ
వశీకరణ సాధనముల నిది స్త్రీకి సులభ ముత్తమము గాదె" అని
భావించుచు సత్యభామను గౌఁగిలించుకొనును. ఒడలెఱుంగని కోపమున
నేఁజేసిన యపచారములను క్షమింపవలెను, అని యామె ప్రార్థించును.
"పరమ లోభికి భయమెంతో భాగ్యమంత। రమణికి నసూయ యెంత
యో రాగమంత। తన్నినది నీకుకోప మంచెన్న దగదు। తదుప్రిమనుఁ గా
రణంబైన దయయెగాని." అని కృష్ణుఁడామె ననునయించును. ప్రాణ
నాథా! క్షమింపుమని కృష్ణునిఁ బ్రార్థించుచు సత్యభామ రాధవైపు
మొగంబిడి "చూచితివా! నాథుఁడిప్పు డెక్కడనున్నాఁడో. ఇంక నీతని
నాపక్కనుండి యెన్నఁడు వేఱుచేయకుసుమా! చేసినయెడల ననుభ
వింపఁగలవు సుమా!" అని గద్దించెను. "నాకుఁ గాంతుఁడు నాశిరమున
నున్నాఁడు. కనులందున్నాఁడు. జిహ్వయందున్నాఁడు. హృదయమున
నున్నాఁడు. ఆతఁడు నాలో నున్నాడు. నేనాతనిలో నున్నాను." అని
రాధ గంభీరముగాఁ బలికెను. ఆమాటలు విని సత్య "నేను దీనిచే

నొక విచిత్రమైన వికారమునకు లోనగుచున్నాను. ఇదియేమో వింతగ నున్నది." అని మనసులో వితర్కించుకొనెను. శ్రీకృష్ణుఁడును "అటులు గర్వోపశాంతికై యిటులు భామ|నీడ్చి కూడ రానని బిగియింపకుండ| ముదిత యిష్టానుసారమే పోవవలెను| గాని రాధను విడుచుట కష్టమైన" ఇప్పుడిపు డన్నిచోటుల నేనె యున్న|యట్లు చూడ నారంభించు నట్టి రాధ|భక్తి కనులకేఁ గనఁబడఁ బ్రబలఁబోదు | గనులుమూయక మనసు పారిఁకంగఁ గలదె"యని లోలోన భావించి ప్రకాశముగా "సాధు! రాధా! సాధు" "బోటి!బ్రహ్మాండమంతయు నోటఁ జూపినట్టి నన్ను శిరమునందు, నఖులందు | హృదయమునఁ బుష్పమువలె ధరించినావు| జన్మమునఁగను నీదిదె జన్మ మహహా!" అని ప్రశంసించి "ఏను నీలోన నుంటినంచీవు తెలుపఁ | బోయివచ్చెద సెలవిమ్ము పుష్పగంధి|యనుట యెట్టులు!నీవునాయందునుంట|నాతినిను వీడిపోవుట నాతరంబె" అని వచింప సాష్టాంగమొనర్చి దాసురాలిమెడ దయ యుంచుమని రాధ యాతనిని బ్రార్థించును. "రాధా! కళ్యాణమస్తు" అనిదీవించి కృష్ణుఁడామెను లేవనెత్తును.కృష్ణుఁడు, సత్యతో మధురకుఁ దరల రాధ,లలిత, మధురయుఁగూడ నటనుండి నిష్క్రమింతురు.

చిరకాలమయ్యెను. కృష్ణుని భౌతిక శరీర దర్శనము రాధకు మరల గలుగనేలేదు. రాధ సత్యభామ దౌష్ట్యము ధూర్తవర్తనముఁ గనులారఁ గాంచిన దవుట నామె నాథునిఁగట్టికట్టడిలో నుంచి యిఁకఁ దనదరికిఁ జేరనీయదని తలంచి నిస్పృహఁజెంది నానాఁటికిఁ గృశించుచుఁ దుదకునున్మాదినియై యమునాతీర పరిసరారణ్యముల సంచరించుచుండెను.ఆమెనువెదకికొనుచుఁ జెలికత్తె మధుర బయల్వెడలి యమునాతీరమున వికృతరూపమైన "ఏఁడీ! ఏఁడీ నాపతి, నా నాథుఁడు, నాప్రియుడు. నా కాంతుఁడు,నామోహనుఁడు, నా ప్రాణ నాథుఁడు...నాసర్వము ఏఁడీ ఏఁడీ యని యంగలార్చుచు నేడ్చు

చున్న రాధను బొడగాంచి "అమ్మా! అతఁడిచ్చట లేఁడు. మధురలో
నున్నాఁడు." అనిపలుక రాధ "ఏఁడీ!నీలోనున్నాఁడా! ఇదిగో నమ
స్కారము. నానాథుని నాకిమ్ము. ఈయని యెడలఁ జూపించుము. నా
వల్లభుని నీహృదయమున దాఁచుకొంటివా? ఏఁడీ కనఁబఱుపవా?పుణ్య
ము గట్టుకొనవా!" అని పలవింప మధుర "అమ్మా! నాలో లేఁడు.
మధురాపురములో నున్నాఁడు." అని వచించెను. "మధుర యందు
నివసించు నతఁడనుకొగాని సర్వత్ర వ్యాప్తుఁడగును."ఇంతకు నేఁజెప్పఁ
బోవుగదేమన ఒక పావుగడియకిందట నాతో మాటాడిన ప్రాణ
నాథుఁ డిప్పుడెక్కడికిఁ బోయెను?" అని పరిపరివిధములఁ దన దృష్టికి
గోచరించి యాతఁడొనర్చిన విలాసముల నేకరువు పెట్టును. భక్తులరీతి
"బాలోన్మత్తపిశాచవత్" అని గదా యార్యోక్తి. ఇట్టిస్థితిలో వన
మంతయుఁ గాషాయవస్త్ర ధారిణియై, పిచ్చిదానివలెఁ గృష్ణ భక్తి
గీతములఁ బాడికొనుచు పరిభ్రమించురాధ నూఱడించి యింటికిఁ దీసి
కొనిపోవుటకుమధురకుసాధ్యముకాదయ్యెను.అయినను నామెనువిడనా
డకమధురయామెను వెన్నంటియేయుండివిపినములోనామె యొనర్చు
చేష్టలఁ విలోకించి విలపించుచుండెను. ఉన్మాదావస్థలో రాధ యోగినీ
రూపమునఁ బరిభ్రమించుచుఁ గావించు భక్తిచేష్టలు చతుర్థాంకమున
పంతులుగారు చక్కఁగాఁ బ్రదర్శించినారు. తుదకొకనాఁటి సాయం
కాలమున చీకటి పడినతరువాత యమునాతీరమున నేఁగుచు నదీజల
ములఁ బ్రతిబింబించిన చంద్రునిఁగాంచి నాథుని ముద్దుమొగమే యని
భ్రమించి యాతని ననుగమించుటకయి యత్నించెడి రాధాదేవిని గని
యేమి యపాయము వచ్చునోయని భీతిలి మధుర బిగ్గఱగ నఱచుచు
"అమ్మా! అమ్మా! అతఁడు శ్రీకృష్ణుఁడు గాఁడు. చంద్రుఁడు. శ్రీ
కృష్ణుఁడు నల్లనివాఁడు, నల్లనివాఁడు, భ్రమపడకు ! భ్రమపడకు !
జాగ్రత్త! జాగ్రత్త!"అని యుద్బోధించుచున్నను "లోకులకుఁ జీకటిగఁ

దోఁచు లోకగురుఁడు । పరమ దివ్యప్రకాశంబు భక్తునకును భక్తునకుఁ
జీకటిగఁ దోఁచు పాపజగతి । ప్రాకినను దేజము వెలుఁగుఁ గాదె''అని
యుగ్గడించుచు"కృష్ణా!కృష్ణా!కృష్ణా!''యనుచుఁ దటాలున యమునలోఁ
బడి రాధ నిష్క్రమించును. "ఇంక నేమున్నది? రాధ యమునలోఁ
బడి మునిఁగిపోయినది. నిస్సహాయ నైన నేనేమి చేయుదును? ఓ !
యమునా నద్యధిష్ఠాన దేవతా! నీవలెఁ బరమఁపవిత్రమైన రాధ కృష్ణుని
విరహ తాపము సహింపలేక నీటిలో దుమికినది. నీవామె కాపదరాకుండ
రక్షింపవా? ఓకృష్ణుఁడా! బాలలీలానుసారముగ యమునలో నీవుంటి
వని యిందులోఁబడిన రాధ నుద్ధరింపవా? ఓనదీతీర తపస్వులారా!
పరమసాధ్వైన రాధను బైకిఁ దీయరా ? ఆహా! ఆహా! (గుండెలుకొట్టు
కొనుచు) ఇంక నేమున్నది? యయ్యో! మితిలేనియనురాగము మృతికే
కారణ మయ్యెనా! అమితమైన దెప్పుడు నపాయకరమేగదా! అక్క-
డనెవ్వఁడో తాపసి యున్నట్టున్నాఁడు. పోయి యాతనిని బ్రార్థింతును''
అని మధుర నిష్క్రమించుటతోఁ జతుర్థాంకము ముగిసినది.

బృందావనమున రాధ సమక్షమున నున్నపుడే సత్యభామ
కొకవిధమయిన గర్వ ప్రాయశ్చిత్తమయి మనఃప్రవృత్తిలో నొకవిధ
మయిన మార్పేర్పడెనని సూచించియుంటిమి. అటనుండి మధురకు
మరలవచ్చినతరువాత నామె మతింత చిత్తసంస్కారమున కాకరమయ్యెను.
పంచమాంకారంభమున రచించిన విష్కంభములో తరళా శారదుల
సంభాషణరూపకముగఁ బంతులుగారీవిషయమును బాగుగాఁ బ్రస్తా
వించిరి. సత్యభామ యంతఃపురములో నామెయు శ్రీకృష్ణుఁడు ముచ్చ
టించుసమయమున శారదుఁడు గూడ నట కేతెంచును. "చెప్పరాదా!"
అని దేనినిగూర్చియో సత్యభామ కృష్ణునిఁ గుచ్చిగుచ్చి యడుగు
చుండఁగా"పోనిమ్మ.నీ కెందులకు'' అనియాతఁ డుదాసీనతఁ బ్రకటింప
శారదుఁడు"మిత్రమా! చెప్పరాదా, నేనుగూడ విని సంతసింతును" అని

హెచ్చరించును. "మీరు నాయందు దయయుంచి చెప్పవలెను." "ఆహా! యెంతప్రమాదము! కాని నీకేమి భయము లేదు." అని యిటీవల మీరు నాప్రక్కనుండి యదరిపాటున లేచి యెందులకు బిగ్గఱగ కేకవేసితిరి" అని సత్యభామ శ్రీకృష్ణుని మరలఁ దొందరతో నడుగును. "ఒక భక్త శిఖామణి యమునలో నాకస్మికముగఁ బడి నటులు నాకుఁ గనఁబడెను. పేరువదలి యూరువదలి సర్వమునుగూడఁ బరిత్యజించి కాషాయాంబరము మాత్రము ధరించిన వ్యక్తివలె నాకుఁ గోచరించెను" అని కృష్ణుఁడు వచింప "అట్టి మహామూర్తి దర్శనము సర్వాభీష్టప్రదాయకముగాన నద్దర్శనలాభమును మీరు నాకుఁగలుగఁజేయవలెను." అని సత్య ప్రార్థించెను. యతులలోఁ దఱచుగఁ బైవేషమున కనుగుణమగు నంతరంగ స్వరూపము కనఁబడదనియు, యతినింద దోషమయినను యథార్థాచ్ఛాదనము దోషతరమగుట నిట్లు చెప్పితినని పరిహాస రూపకముగ శారదుఁడు కొంత యప్రస్తుత ప్రసంగము గావింప "శారదా! నీనోటివెంట నెన్నఁడును మంచిమాట రాదుగదా!" అని సత్య మందలింప, "నాకు గర్వప్రాయశ్చిత్తము కాలేదే" అని యాతఁడు ముడలకించును. "ఈనిర్భాగ్యుఁడు నన్నధిక్షేపించుచున్నాఁడు! అబ్బా సహనము కంటెఁ గష్టతరమైన పని లేదు గదా!" యని యామె మనసులో ననుకొని సహనము వహించి, "నాథా! ఆభక్తాగ్రణి దర్శనము నాకు లభింపఁజేయరా" లని కృష్ణుని మరలఁ బ్రార్థింప నాతఁడాలాగే యనెను. ఎప్పుడన నిప్పుడే యనెను. అంతనామె నాకు భక్తియోగముపదేశింపరా" యని వచింప నీకదియా భక్తశిఖామణి సన్నిధిని నారదునిచే నుపదేశింపఁ జేయుదును" అని కృష్ణుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. ఇంతలో నారదుని వీణాగానరవము వారికి వినవచ్చెను. నారదుఁ డేతెంచెనని యెంచి యాతనిని లోనికిఁ బ్రవేశపెట్టుమని కృష్ణుఁడు పరిచారకు నాజ్ఞాపించెను. జయజయ నినాదములతో శ్రీకృ

ష్ణస్తవముతో నారదుఁడు ప్రవేశించెను. సతీ సమేతముగ నమస్కరింప నారదుఁడు వారి నాశీర్వదించెను. సత్య (అపవారించి) "నాథా! భక్తుఁడేడీ" అని యాత్రముతో నడుగును. కృష్ణుఁడును (అపవారించి) "సత్యా! చూడకున్నంతవఱకే సంభ్రమముగాని చూచినతరువాత సంకోచించెదవేమో" అని పలికెను "నేనంత మూర్ఖురాలనని మీా యభిప్రాయమా" యని యామె యపవారించియే వచించెను. సరే చూచెదముగాక అని చెప్పుచు శ్రీకృష్ణుఁడు నారదునిఁ జూచి కుశలప్రశ్న మాచరించెను. నీ కటాక్షమున కుశలమేయని చెప్పి -

"అఖిలవస్తుసంతతి నీదె యుంకులోన | నది మఱింత నీదియె భవత్పద
కమలోజ | భక్తురాలాటచే దైన్యభావయుగుట | నంతకంటె నీదె గ్ర
హింపవయ్య దాని" అని పలుకఁగా సత్యభామ "నాథా! భక్తుఁడు కాఁడా! భక్తురాలా" అని వచించును. నారదుఁడు ద్వారమునొద్దనున్న మునిబాలకుని, నాతనితోనున్న భక్తురాలిని లోనికిఁ దీసికొని రమ్మని కృష్ణుని పరిచారకునితోఁ జెప్పినాతఁడు వారిని లోనఁ బ్రవేశపెట్టుటకయి వెళ్లెను.

కృష్ణుఁడు "సత్యా! భక్తుఁడు కాఁడా భక్తురాలా!" అనియడిగితివి "వర్ణలింగనామాకృతి ప్రముఖ భేదములు బహిస్తనువునకె తజ్జసుఖములు | విడుము భక్తునకవి యేలవివిధభేద | ములు సుమములకే మకరందమునకు లేవు" అని పలుకునంతలో నారదశిష్యుఁడు రాధాసమేతుఁడై యెదుటఁ బ్రవేశించును. కృష్ణునిఁ గాంచినంతనే "హా రాధాకృష్ణా!" యని రాధ మూర్ఛనొందును. కృష్ణుఁడు రాధనొద్దఁ గూర్చుండి "తమమునందుండు నతనినేత్రములొకపరి వెలుఁగుగని మూసికొనినట్లు విరహావివశ | మైన దీనిచిత్తము నన్నుఁ బట్టిచేరఁ దిరిగి వివశత నొందెను దేవమౌని" అని నారదునితోఁ బలుకఁగా నాతఁడు "మహానుభావా! ఈమె చిత్తము నేత్రములు నిన్నిదివఱకే చేరినవి. చంద్రుని చూచి

నీవని భ్రమించి యమునలోఁ బడినది. యమునలోఁబడి హంసికవలెఁ బ్రవాహమునఁ బోవుచుండఁగా నేను గాంచి యీమునిబాలకుని నీఁదికొనిపోయి పట్టుకొమ్మని పంపితిని. "నా బాలకృష్ణుఁడిచ్చట న్నాఁడును. నేనురా"నని కేకలు వేయుచున్నను బలాత్కారముగ నీతఁడే యొద్దునకుఁ దీసికొని వచ్చినాఁ"డని చెప్ప "నీవునాకు మహోపకార మొనర్చితివని" కృష్ణుఁడు మునిబాలకునిఁ బ్రశంసింపఁ "స్వామీ! దాసుఁడను. కటాక్షింపవలెను" అని యాతఁడు శ్రీకృష్ణుని పాదముల కెరగెను. "నామనస్సు నీరగుచున్నది. రాధాదర్శనమువలననే యనిర్వాచ్యమైన యొక మనఃస్థితిని బొందుచున్నాను. ఆహా! ఈమె పరమ ధన్యవలెనున్నది. ఐహికములన్నియుఁ ద్యజించిన పరమ భక్తురాలు. ఇట్టి మహా పవిత్రి దర్శనముఁ జేసి నేను గృతార్థురాలనైతి"నని తనలో సంభావించి సత్య సంతుష్ట చిత్తయయ్యెను. కృష్ణుఁడును "రాధా! యింకను లేవకున్నావేమి. "నాకొఱకు నీవుపడినట్టి భీకరోరు|కష్ట సంఘటనలకు నేనుగాంత! నీదు ఋణముఁదీర్చుకొనఁగ లెనుప్రీతి నీదు| సన్నిధివశుఁడ నగుదు శాశ్వతముఁగాఁగ అని పలుక రాధకూడ లేచెను. సత్యయు, "రాధా! నమస్కారము ఇంతవఱకు నీస్వభావము నేనెఱుఁగనిదాననై నీ యెడలదప్పుచేసితిని. క్షమింపుము. నీవు నానాదునెటులు ప్రేమించితివో యట్టిప్రేమ నాకుఁ గూడ నుపదేశింపుము." అని రాధకు సాష్టాంగ పడెను. "చెల్లెలా! లెమ్ము మనమిద్దఱము గూడ నీ మహానుభావుని సేవింతము." అని రాధ పలుక నిరువురుఁ గృష్ణునకుఁ బ్రదక్షిణము చేసి "కృష్ణా! కృష్ణా!యని పలుమాఱు కీర్తింతురు. చిరకాలశ్రమమునఁ గాని యభ్యసింపనేరని భక్తియోగము భక్తాగ్రేసరయగు రాధా సంస్పర్శంబున నీకిట్టె లభించెనని నారదుఁడు సత్యను బ్రశంసించి తానుగూడ నామె కుచితరీతి భక్తిప్రబోధ మొనర్చెను. అనంతరము రాధాకృష్ణదర్శనలాలసలగు కాంతలకు రుక్మిణ్యాదంతఃపుర కాంతలకు

దర్శనమొసంగి రాధాకృష్ణులు రంగమునుండి నిష్క్రమించుటలో మంగళాంతముగ నాటకము సమాప్తమగును.

కవిరచనావైశిష్ట్యము

నాటకరచనా నైపుణ్యముననను, పాత్రసంభాషణము లందలి వాక్యోపవాక్య సంఘటన చమత్కృతియందును శ్రీ నరసింహారావు పంతులుగారికి గల సహజసామర్థ్యములఁ గూర్చి ముందే ప్రశంసించి యుంటిని. నవరసములుగూడ వీరి రచనములలో నందందు యథోచితముగఁ బోషింపఁబడుచుండును. అదునను హాస్యరసము పుట్టియు వెలార్చుటలో వీరికిఁగల నైపుణ్య మగణ్యము. వారికి "అభినవ కాళిదాస" బిరుదమునుగూడ విద్వద్వర్యులు ప్రసాదించియున్నారు. "ఉపమా కాళిదాసస్య" అను విశ్రుతి కనుగుణముగ నుపమాలంకారము నుచితవిధముగఁ దమరచనముల నుపయోగించుటమూలముననే పండితులీ బిరుదమును వారికిఁ బ్రసాదించియుందురు. ప్రథమ నాటకమగు నర్మదా పురుకుత్సీయమునందే వీరి యుపమా ప్రయోగ నైపుణ్యము లెస్సగాఁ బ్రదర్శితమయినది. ఈ వైశిష్ట్యము రాధాకృష్ణ నాటకమునందును బాగుగా గోచరించును. విదూషకుఁడు శారదుఁడు కృష్ణునితోనేగాక యితరపాత్రములతోనొనర్చు సంభాషణములందును సరసమయిన హాస్యము విరియుచుండును. ఉచితస్థానములలో నుపమలు గూడ బాగుగాఁ బ్రయుక్తములయినవి. ఇంతేగాక శబ్దశ్లేషలు, వక్రోక్తులు గూడ నందందు మనోహరముగఁ బ్రస్ఫుట మగుచుండును. మచ్చునకుఁ దృతీయాంకమున అంతర్నాటిక ప్రారంభమునకుముందు రాధకు నామె చెలికత్తెలకు జరిగిన సంభాషణములఁ దిలకించునది,

రాధ:- అహా! మధురా! "కూడ" యను నీమాట యా మధురానాథుని వేణుగానరవమువలె నవ్యయ మాధుర్యమై" యున్నదిసుమా!"

లలిత:- చిర విరహార్తవగు నీకది యవ్యయ మాధుర్యమే
కాదు.

రాధ:- నీ యాక్షేపణమున కేమిగాని, నా కాంతుఁ డిటకువచ్చునా?

చెలులారా:- మీరు సిద్ధముగ నున్నారా!

మధుర:- అమ్మా లేదు. సిద్ధముగ నుండుట యెందులకు?

లలిత:- ఇండ్లకుఁ బోవుటకు

రాధ: ఆరాధన యిచ్చుటకు నా కాంతునికి

లలిత:- ఆ రాధ నిచ్చుటకు సిద్ధముగ నేయున్నాము.

భగవద్గీతయందు శ్రీకృష్ణుఁడు బోధించిన వేదాంతము యొక్క సారమీ రాధాకృష్ణ నాటకమందును బ్రతిపాదితమయినది. భక్తులకు భక్తియోగ నిరూఢికే గాక యద్వైత వాదుల యద్వైత సిద్ధికిగూడఁ విగ్రహారాధనముపకరించునటనెడి యుద్బోధ కావింపఁబడినది. ఇట్టు లనేక విధముల నీనాటకము భక్తులకు నితరులకుఁ గూడ నవశ్యపఠ నీయమగు చున్నదనుటకు సందియము లేదు.

చారిత్రిక వైరుధ్యము: కాల విపర్యయము

మధురాపురము, బృందావనము నీ రెండుమాత్రమే యీనాట కమందలి రంగస్థలములుగా నున్న విషయమును ముందే వివరించి యుంటిని. కంస సంహారానంతరము జరాసంధాది ప్రతిపక్షులబాధలకు దూరముగా నుండుటకయి శ్రీకృష్ణుఁడు, బలరాముఁడు, సౌరాష్ట్రమున సముద్రతీరమున ద్వారకాపురిని నిర్మించి యచ్చట నివాసమేర్పఱచి కొనినట్లు భాగవతాది గ్రంథములవలన వ్యక్తమగును. గోపికాస్త్రీల తోడి క్రీడలు, విహారములు, కృష్ణుఁడు గావించినది మధురాపుర బృం దావనములందున్నపుడేగాని ద్వారకను జేరిన తరువాతఁ గాదని తోఁచును. రుక్మిణి మొదలగు యష్టమహిషులను గృష్ణుఁడు పరిణయ మయినదిగూడ ద్వారకలో నివాసమేర్పఱచుకొనిన యనంతరమేయని

స్పష్టముగ గోచరించును. రుక్మిణీ సందేశహారుఁడగు విప్రుఁడు కృష్ణుని సందర్శించినది కూడ నచ్చటనే. కాని యిందుకు విరుద్ధముగ నీ రాధాకృష్ణ నాటకమున రాధతో బృందావనమున శ్రీకృష్ణుఁడు విహరించుకాలమున సత్యభామ, రుక్మిణి, మథురలోనే శ్రీకృష్ణునితో గాఁపురము చేయుచున్నట్లున్నది. ఇది కాల విపర్యయదోషమున కాకరమై చరిత్రవిరుద్ధముగ నుండునేమోయని నాయభిప్రాయము. సత్యభామకు గర్వప్రాయశ్చిత్తమును రాధాసందర్శ సంస్పర్శలమూలమునఁ గలిగించుటయే ప్రధాన లక్ష్యమగుటచే నీ విపర్యయములఁ బాటింపక పంతులుగారీ పూర్వులను బుద్ధిపూర్వకముగనే జరిగించి యుందురని తలంతును. ఛందోవిషయములలో అఖండ యతి, ల డ ల ప్రాసము పంతులుగారికి సమ్మతమని యిందలి పద్యముల వలనఁ దెలియఁగలదు.

---

# కీ. శే. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

అభినవ వాగనుశాసన బిరుదాంకితులు, సుప్రసిద్ధ పండితులు నగు వీరు ది 19—6—62 మంగళవారమునాఁడు తమ 82వ యేట బ్రహ్మీభూతులయిరని తెలుపుటకు విచారమగుచున్నది. శ్రీ శాస్త్రిగారు గోదావరీ మండలములో గౌతమీతీరస్థమగు కడియపు లంకలో 1880 లో జన్మించిరి. ఆ కాలములో ధవళేశ్వరమున గురు కులమును నెలకొల్పిన యపర పతంజలి శ్రీ చర్ల బ్రహ్మయ్యశాస్త్రి గారి శిష్యులుగా శబ్దశాస్త్రాదికముల నభ్యసించిరి. 1900 సంవత్సర మునఁ దొలుతొలుత అమలాపురమునందలి యున్నతపాఠశాలలో స్వల్పవేతనమున నాంధ్రభాషాధ్యాపకులుగఁ బ్రవేశించి యనంతరము నలుబదిసంవత్సరములు రాజమహేంద్రవరము, అనంతపురము కళా శాలలందు, ఆంధ్రవిశ్వవిద్యాలయ కళాశాలయందు నాంధ్ర గీర్వాణ పండితులుగాఁ బనిచేసిరి. ఆంధ్రసాహిత్య పరిషత్ కార్యాలయము చెన్నపురిలో నున్నప్పుడందుఁ బరిశోధకులుగానుండి యపారమయిన భాషాసేవ గావించిరి. బాల్యమునుండియు వీరు ప్రతిభా సంపన్నులు. స్వతంత్రవ్యక్తిత్వము గలవారు. విదురనీతి, స్త్రీధర్మబోధిని, సత్యకీర్తి (నాటిక), భీష్మప్రతిజ్ఞ (నాటకము), భవభూతి, భాసనాటకకథలు, తన్నాటకాంధ్రీకరణములు, సంస్కృతకవి జీవితములు, సంస్కృత వాఙ్మయ చరిత్రము, ఆంధ్రదశరూపకము, ఆంధ్రభాషానుశాసనము, ఆంధ్రభవిష్యపర్వము, ప్రేమతత్త్వము మున్నగు ననేక గ్రంథములు వ్రాసి మహారాజులయుఁ బ్రజలయు మన్ననలందిన మహాపండితులు. ఉపాధ్యాయ పండితపరిషత్తు స్థాపించి పాఠశాలా కళాశాలాంధ్ర గీర్వాణ భాషాధ్యాపకుల వేతనాభివృద్ధికయి విశేషకృషి గావించిన వారు. శాస్త్రీగారి నిర్యాణమువలన భాషాలోకమున కపారనష్టము కలిగినదని చెప్పక తప్పదు. సచ్చిదానందమూర్తియగు పరమేశ్వరుఁడు వీరి యాత్మకు శాశ్వతానందమును బ్రసాదించుఁగాక.

## కాకతిప్రోలరాజు మాటేడుశాసనము *

శ్రీ కె. హెచ్. వి. శర్మ.

గూడూరు శాసనము నిటీవల పరిషత్పత్త్రికలోఁ బ్రకటించిన తదుపరి దానివలెనే కాకతీయులను గూర్చిన యద్భుత చరిత్రాంశములు గలవనెడి మాటేడు శాసనమును పరిశీలించుట తటస్థించినది. నాకుఁ దెలిసినంతవఱకు నీశాసనము మొదట శ్రీ లక్ష్మణరాయ పరిశోధకమండలి అధ్వర్యవమున వెలువడిన తెలంగాణా శాసనసంపుటము మొదటిభాగమునను, పిదప శ్రీమాన్ పుట్టపర్తి శ్రీనివాసాచారిగారి సంపాదకత్వమున నూతనముగా నిటీవల బయటఁబడిన హైదరాబాదు ఆర్కియలాజికల్ సీరీస్ నంబరు 19 A Corpus of Inscriptions in the Telangana Districts of Andhra Pradesh అను గ్రంథమునను బ్రకటింపఁబడినది. తెలంగాణా శాసన సంపుటము మొదటి భాగ మెంత యధ్వాన్నముగ వెలువడినది పండితులందఱికిని విశదమే. అందు కాకతీయుల శాసనము నంబరు 4 పుట 5, మఱియు నంబరు 54గు 95-96 పుటలలో బ్రకటింపఁబడిన ఈ మాటేడు శాసనపాఠము లెంత యవకతవకలుగనున్నది చదువరులకుఁ దెలియును. కాని సంపాదకుల వివరణ మాత్రము గమనింపఁదగినది. "ఈశాసనము మధ్యమధ్య చెడిపోయి యుండుటచే బ్రతిబింబ మస్పష్టముగ నున్నది. త్రిభువన మల్లదేవుని సామంతుఁడొకఁడు దాయాదు లపహరించిన ఆంధ్ర సామ్రాజ్యమును తిరిగి కాకతీయులకు సంపాదించి పెట్టినటులు దెలుపుచున్నది. ఈ శాసనము కాకతీయుల పూర్వచరిత్రమును తెలుపుటలో నద్వితీయ ప్రాముఖ్యముగలది. ఇందలి విషయములు భావిపరిశోధనమునఁ గాని సమన్వయింపవలను పడదు." ఇఁక ప్రభుత్వపక్షమున వెలువడిన హైదరాబాదు ఆర్కియలాజికల్ సీరీస్పై దానికంటె కొన్ని విధములు మెఱుఁగైననునందును బ్రమాదములు చాల గలవు. తెలంగాణా శాసన

సంపుటములలోఁగలదానినే వీరు మరల మరలఁబ్రకటించుటచే వారు గావించిన తప్పులనే వీరును అనుసరించుటమైనది. గూడూరు శాసనము నెట్లుముక్కలుముక్కలుగఁజేసి వేర్వేఱుగఁ బ్రకటించి యాది తుది మొదలులేని యొక విలక్షణమైన శాసనమని వ్రాసినట్లే, ఈమాటేడు శాసనమునుగూడ మూఁడుముక్కలుగఁజేసి వరంగలుజిల్లా 10,11,12 వేర్వేఱు నంబర్లుగ139-145 పుటలలో మరల అదే గ్రంథమున అనంపూర్తిగ దానినే ఖమ్మముమెట్టు జిల్లానంబరు 13గ 27-30 పుటలలో మాటేరను పేరితో ప్రకటించియున్నారు. పాఠకులకు మాటేడు, మాటేరులని రెండుగ్రామములు వరుసగా వరంగలు, ఖమ్మంమెట్టు జిల్లాలలో నుండినట్లును, అందా రెండు గ్రామములలోని రెండుశాసనములలోఁగల విషయ మొక్కటియే యను భ్రాంతికలుగును. తదనుగుణముగ శాసనపాఠములయందును, వారి ఆంగ్లవ్యాఖ్య యందును కొంచెము భేదమునుజూపి అవి రెండు వేర్వేఱు శాసనములుగఁ దెల్పియున్నారు. ఈ విధముగ నొకే శాసనమును వ్యాఖ్య మాత్రము కొంచెము మార్పుచేసి అదేగ్రంథమున రెండుమాఱులు ప్రకటించుట మహబూబ్‌నగర్ జిల్లా జడచెర్ల శాసనమునగూడఁ గలదు. విచిత్రముగ నిందు అదే శాసనమును పంక్తులభేదమైన లేకుండ నొకదాని దిగువనే మఱియొకటి ప్రకటించి ఆంగ్లవ్యాఖ్యను మాత్రము మార్చివేసిరి. ఇట్టు లొకేశాసనమును వేర్వేఱు నంబరులుగ ముక్కముక్కలు చేసి వ్యాఖ్యలు మార్చి యొకేగ్రంథమున పరస్పర సంబంధములనైన సూచింపకుండఁ బ్రకటించుటచే అసలు చరిత్రాంశములు తెలియక తబ్బిబ్బులు చేయుటయేగాక చరిత్రకారులకు చాల అపచారము గావించిన వారయిరి.

అసలు మాటేడను గ్రామము వరంగల్లునుండి వరదన్నపేట మీఁదుగా ఖమ్మము మెట్టునకుఁబోవు బాటలో వరంగల్లునకు సుమారు

40 మైళ్ళదూరమునఁ గలదు. బహుశః మొదలది ఖమ్మము మెట్టు జిల్లాలోనుండి ప్రస్తుతము వరంగల్లునకుఁ జేరియుండును. బస్సురోడ్డు నుండి సుమారు మూఁడు ఫర్లాంగుల దూరమున నొకే ప్రాకారము గల ద్వావరణములో శివ, విష్ణు ఆలయములు రెండు వరుసగా నొక దాని ప్రక్క నొకటి యందున్నవఁట. విష్ణ్వాలయమున కెదురుగ నీ శాసనముపడియున్నది. గూఢూరు శాసనము ను బోలియే చక్కని వల్ల ఱాతి స్తంభమునకు నాలుగువైపులను జెక్కఁబడియున్నది. దురదృష్ట ముచే నీ శాసన ప్రతిబింబములు పై గ్రంథములలో నెచ్చటను బ్రక టింపఁబడి యుండలేదు. వాని ప్రతిబింబము లింతవఱకు లభ్యము కాలేదు. కాని వరంగలు జిల్లా 10, 11, 12 నంబరులుగ శ్రీ శ్రీ నివా సాచారిగారు ప్రకటించిన శాసనపాఠములు చక్కగనేయున్నవి. నాకుఁ దోచినకొలఁది సవరణలతో ఆశాసనము సరియైన పాఠములను మొదట నిచ్చి పిదపనందలి విషయములను చర్చింపఁగలను.

## శాసనమూలము

### మొదటివైపు

1. స్వస్తిశ్రీ సమస్త భు
2. వనాశ్రయ శ్రీ
3. పృథ్వీవల్లభ మహా
4. రాజాధిరాజ (రాజ) ప
5. రమేశ్వర పరమభట్టారక స
6. త్యాశ్రయ కులతిలక
7. చాళుక్యాభరణ శ్రీ
8. మత్త్రిభువన మ
9. ల్ల దేవరు విజయ రాజ్య
10. ముత్తరోత్తరాభివృద్ధి
11. ప్రవర్ధమాన మాచంద్రా
12. ర్కం సేయుగా। సమధిగ
13. తపంచ మహాశబ్ద
14. మహామండలేశ్వర హ
15. నుమకొండ పురవరే
16. శ్వర పరమ మాహేశ్వర ప
17. తిహితచరిత వినయ
18. విభూషణ శ్రీమన్మ
19. హామండలేశ్వర కా
20. కతీయ పోలిరాజు
21. లబంటు (స్వస్తి) సమస్తప్రశ
22. స్తిసహితంబైన శ్రీమ

23. వ్మహాసామంత వేమ
24. బోల బొద్దమ మల్లె
25. నాయకుండు శ్రీమచ్చా
26. ళుక్య విక్రమ కా
27. ల రగి గు శార్వరి సం
28. వత్సర చైత్ర శుద్ధ
29. 2 వడ్డవారమున
30. ఈశ్వరకు నారాయ
31. ణ దేవరకు నాదిత్యదేవర
32. కు గుడ్లెత్తించి (న) వృత్తులు
33. శ్రీమూన కొండూరి మల్లో
34. జు కొడుకు బొల్లోజు (ఈ
35. మూడు) గుడ్లకు సూర్రెడ్డి
36. ఇచ్చిన వృత్తి మత్తుల్లు

రెండవవైపు

37. శ్రీ శకవర్ష ౧౦౨౭ (న)
38. మహాదేవరకు నాదిత్యదే
39. వరకు నిడ్లలికెడు త
40. పసులకు మల్లసము
41. ద్రమున మత్తుల్లు ౨
42. అందేని దేద్యమునకు
43. మత్తు ౧ కార్తిక వెలి
44. వోలముఖ ౧ నారాయ
45. ణ దేవరకు మత్తు ౧ ని
46. వేద్యమునకు మత్తు ౧
47. పీరిక వెలిపోలము
48. మత్తు ౧ వినాయకునకు
49. మత్తు ౧ వెలివోలము
50. ఖ ౧ బ్రహ్మపురుల
51. కు మత్తుల్లు ౪
52. స్వదత్తాం వరదత్తాంవాయో
53. హరేత వసుంధరాం। షష్టి
54. ర్వర్ష సహస్రాణి
55. విష్టాయాం జాయతే క్రిమిః॥
56. బహుభిర్వ సుధాదత్తా
57. రాజభిస్సగరాదిభిః। య
58. స్యయస్య యదాభూమి
59. స్త స్య తస్య తదాఫలమ్॥
60. సామాన్యోయం ధర్మ సే
61. తుర్నృపాణాం కాలే కాలే
62. పాలనీయో భవద్భిః। సర్వా
63. నేతాన్భావినః పార్థివేం
64. ద్రాన్ భూయో భూయో
యాచ
65. తేరామచంద్రః॥మద్వంశజాః
66. పరమహీపతి వంశ
67. జాతా పాపాద పేత
68. మనసో భువి భూమి పా
69. లాః యే పాలయంతి మ
70. మధర్మమిదం సమస్తం
71. తేషాం మయా విరచితాంజ
72. లిరేవ మూర్ధ్ని॥ బొల్ల
73. య వెలి వోలము

మూఁడవవైపు

74. నారాయణ దేవర
75. పౌలము మండనప్పడ
76. వంకన వ్రోలు॥
77. శ్రీ వాణీ ప్రియుండా
78. దికర్త త్రిజగత్సేవ్యుం
79. డు బుట్టించె భూదేవ
80. క్షత్త్రవైశ్య శూద్రుల
81. మహా తేజంబుతో వారలం
82. గావం బూని పులిందవంశక
83. రులం గల్పింప దద్వంశజుం
84. డావిఖ్యాత యశుండు
85. బూచన సుపుణ్యాత్ముండు
86. పుట్టెను మహిని (1) పేచి
87. పరాక్రమంబున సహిం
88. పక యున్నెడ గోటమల్లడిం
89. డ్రాచల ధీరుండై పగత
90. నాజి జయించి విశేషలీల
91. తోఁ నాయాచక కల్పవృ
క్షుండ
92. న నాద్యుల కంకెనుం దానె
93. పెద్దయై బూచన వేమ
94. బోలకుల భూషణుండై
95 పరగెను ధరిత్రిపై (2) బూ
96. చనకిట్ట శిష్ట సుర భూ
97. రుహ మూర్తికిం బుట్టి
98. రాత్మజులు గీచక వైరివి
99. క్రముండు గిల్చిమ దూరుం
100. డు రాముండును మ
101. హేంద్రాచల ధీరుండప్పం
102. డు భటాగ్రణి రేవండు
103. ధాని దండియు నాచండు
104. బుట్టి రంబుధులు నాలుగుం
105. పోలె ధరా తలంబునను (3)
106. అమల గుణాఢ్యులై ప
107. రగు సంతతిలోంజ
108. డి సన్న చేత భూపతి నిజ
109. రాజ్యవర్ధనుండు బాహుబలం
110. బునం జేసి భూమిం
111. సంతతమునుం గప్పము
112. లు గొని బుధ ప్రియు

నాల్గవవైపు

113 డై జయశాలి రేవండూర్జితు
114. డై వేమ బోలకుల శేఖ
115. రుండాతడుదానిదండివెఱ(4)
116. శ్రీరమణీయుండు
117. ధారుండు ధీరుండు, దారిద్ర్య
118. వైరియును పేర నెగడికాకతి
119. రాజులం జేకొని దాయల ని
120. ర్జించి రాజ్యంబు నిలిపి వా
121. రిచేం ప్రతి పత్తులుం దాం
122. ప్రశాసనములు నాల్గుం

123. బేల్లును నొప్ప బదసె కదు రా
124. ధిమంతుండై (5) కడిమి మెయిబర
125. దేశములు సూఆగొని జగద్వ
126. లయమందున మన్య రేవం
127. దనం గీర్తి మహిమం డ
128. నరి మనిన యాతని కుది
129. యించె మను నిభుండు దా
130. త తంత్రుల కీర్తులు దనరి
131. వెలుంగ మల్లండన ధ్ఖాతి
132. పీళుల నెల్ల బరగె(ర్మిశకమ
133. హీపాలాబ్ధ నికరంబు నయన
జల
134. నిధి నభోవిధు సంఖ్య
135. నెగడుచుండ బొద్దమకీ
136. వేమబొల్ల కుల శ్రేష్ఠుం
137. డైన రేవయకును సగ్ర తన
138. యుండెలమిగ గరిడి యా
139. బలమల్లుండన నొప్పుపేళ్లల
140. బరగిన పేర్మిహొంద (7) కైలాస శై
141. లంబు కరణిగా హరిహార భా
142. స్కరగృహములు పరమ భ
143. క్తి నెత్తబంచె వారాసికి
నిను
144. మదుంగు గాండటాకంబు
జేతి
145. యాకాశమదరనిలిపె (హరి
హర)
146. మా ర్తండుండ శేషలోక ము)
147. లందా చంద్రార్క తారక
148. ంబు పరగిన యీశ్వరాదు
లకు
149. నిలిపె గృహంబులెల్ల తాను
(8)

శాసనపు మొదటివైపున శ్రీమచ్చాళుక్య త్రిభువన మల్లదేవుఁడు రాజ్యము సేయుచుండ నాతని సామంతుఁడు సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర బిరుదాంచితుఁడు ననుమకొండ పురవరేశ్వరుఁడగు కాకతి ప్రోలరాజుల బంటు శ్రీ మన్మహా సామంత వేమబోల బొద్దమ పుత్త్రుఁడగు మల్లెనాయకుఁడు చాళుక్య విక్రమ వర్షము ౪౨ శార్వరి చైత్రశుద్ధ సప్తమి శనివారమునాఁడు ఈశ్వర, నారాయణ, సూర్య దేవరలకు ఆలయములు గట్టించి కొన్ని వృత్తుల భూమిని దానమిచ్చె నని గలదు. రెండవవైపు శకవర్షములు ౧౦౪౨ న మహాదేవ, ఆదిత్య, నారాయణ వినాయకుల నైవేద్యాదులకు, అచటి తపోధన బ్రహ్మ

పురులకు మల్ల సముద్రమను చెఱువు క్రింద నిచ్చిన వృత్తుల వివర ములున్నవి. పిదప నాలుగు వ్యాసగీతములు బోల్లయ వెలివోలమని ముగియును.

మూఁడవవైపు నారాయణదేవర పొలము మండన్నప్పడ దండన వారిలని మొదట చెక్కఁబడి తదుపరి శాసనదాత మల్లన వంశ ప్రశస్తి తెలుఁగు పద్యములలోఁ గలదు. వాణీప్రియుఁడు, ఆదికర్తయు, త్రిజగత్సేవ్యుండగు బ్రహ్మ బ్రాహ్మణ క్షత్రియవైశ్య శూద్రులను సృష్టించి వారందఱను సంరక్షించుటకు పుళిందవంశము నొకదానిని గల్పింప; అందు మిక్కిలి పుణ్యాత్ముండగు బూచన పుట్టెను. కోట మల్ల బిరుదాంచితుఁడగు నాతఁడు శత్రువులనందఱి నవలీల జయించి త్యాగమున పూర్వులనందఱిని మించి యాచకకల్పవృక్షమని ప్రసిద్ధి వడసి వేమబోలకుల శ్రేష్ఠుఁడయ్యెను. ఇష్ట, శిష్ట సురభూరుహమూర్తి యైన ఆ బూచనకు భీమపరాక్రముఁడు, కిల్బిషదూరుఁడగు రాముఁడు, మహేంద్రాచలధీరుఁడు అప్పడు, భటాగ్రణి రేవఁడు, దాని, దండియు నైన నాచఁడను నలుగురు పుత్రులు నాలుగు సముద్రములను బోలి పుట్టిరి. అమలగుణాఢ్యులైన ఆ నలుగురిలోఁ రేవఁడు సన్న బేత భూపతి నిజరాజ్యవర్ధనుఁడు, బాహుబలమున జేసి భువిసంతతము కప్పము లను బొంది బుధప్రియుఁడు, దాని, దండియునై వేమబోలకుల శేఖరుఁ డయ్యెను. శ్రీ రమణీయుఁడు, ఉదారుఁడు, ధీరుఁడు దారిద్ర్యవైరి యని ప్రసిద్ధిని బొందిన యాతఁడుగాకతిరాజులఁ జేకొని వారి శత్రువు లను నిర్జించి సామ్రాజ్యము సుస్థిరము చేసి వారిచేఁ బ్రతిపత్తులు, తామ్రశాసనములు, ఊర్లు, బిరుదములు మున్నగునవివడసెను. పరా క్రమముతోఁడ శత్రుదేశములనన్నిటిని చూఱఁగొనిభువి మన్యరేవఁడని మిక్కిలి కీర్తిని బొందిన యాతనికి మనునిభుఁడు, తాతతండ్రుల కీర్తు లతో నొప్పు మల్లఁడనువాఁ డుదయించెను. శకవర్షములు నయన

(2) జలనిధి (4) నభో (0) విధు (1) సంఖ్యలతో గూడిన వత్సరమున బొద్దమకు వేమ బొల్లకుల శ్రేష్ఠుఁడైన రేవయకును నగ్రతనయుండును, గరడియాజల మల్ల బిరుదాంచితుఁడగు ఆమల్లఁడు కైలాస శైలముతో సరియగు హరి, హర, భాస్కరాలయములు పరమభక్తి నెత్తించి, ఆకస మదురునట్లు సముద్రమునకు రెట్టింపు తటాకము నొక దానిని త్రవ్వించి యాచంద్రార్క తారకముగా ఈశ్వరాదులకు గృహములు నిలిపెను.

ఒకే లిపిలో శిలకు నాలుగు వైపులను గల శాసనమంతయు జాగ్రత్తగా పరిశీలించిన నెవ్వరికైన నది యొకే శాసనమని స్ఫురింపక పోదు. మొట్టమొదటివైపు ఆ శాసన ప్రధానోద్దేశ్యము పశ్చిమ చాళుక్య ప్రభువు త్రిభువనమల్ల బిరుదాంచితుఁడగు ఆఱవ విక్రమాదిత్యుని రాజ్యకాలమున నాతని మహామండలేశ్వరుఁడగు గాకతి రెండవ ప్రోలరాజు సామంతుఁడు వేమబోలవంశజుఁడగు మల్లన శివ, విష్ణు, సూర్యుల కాలయములు గట్టించి కొంత భూమిని దానమిచ్చెనని యున్నది. రెండవవైపు ఆదాన వివరములు తెల్పి వ్యాసగీతములతో నావిషయమును పూర్తిచేసినాఁడు. పిదప మూఁడు, నాలుగువైపుల శాసనదాతయగు వేమబోల మల్లన వంశము, తండ్రి, తాతలు, వారొనరించిన ఘనకార్యములు తెలుఁగు పద్యములలోఁ బ్రశంసింపఁబడినవి.

ఈ సందర్భమున శాసన సంపాదకులగు శ్రీ పుట్టపర్తి వారి ఆంగ్ల వాఖ్య మిక్కిలి గమనింపఁదగినది. రెండవవైపునఁ గల శాసన భాగమును గూర్చి వారిట్లు చెల్పిరి. "Neither donor's name nor the King's name is mentioned; but it records gifts of various pieces of land near Mallasamudram for the different deities Mahadevara, Aditya devara, Narayanadevara and Vinayaka in Saka 1042" మూఁడు నాలుగు

వైపులఁ గల తెలుఁగు పద్యములను వారు సరిగా అర్థము చేసికొని నట్లగపడదు. చూడుఁడు.

"This inscription gives a few surprising details about the early history of kakatiyas.

Vishnu was born in the fourth caste in the pulinda caste, also called vema-bolakula (i. e. boyas ?), in order to protect the four castes. Buchana was born in this caste who had a son called Gotamalla. His sons were Rama, Appa, Reva and Nacha. Reva made a name for contributing to the progress of the kakatiya kingdom. He fought with the enemies of the Kakatiya Kingdom and having defeated them secured the firm foundations of the same. He thus won the title daridra-viri and several villages from the Kakatiyas. His attempts to conquer other lands won the title manya—deva for him. He had two sons. Boddamaya and Malla. Boddamaya had the title Garidiya bala-malla. He established Harihara and Bhaskara temples and some tanks.''

ఆ పద్యములలో నెక్కడ విష్ణువు చతుర్థకులమైన పుళింద లేక వేమబోలవంశమున జన్మించినట్లు గానరాదు. బూచన పుత్రుఁడు కోటమల్లఁడనియు నాతనికి రామ, అప్ప, రేవ, నాచయులు జన్మించి రని తెల్పిరి. అది సరిగాదు. కోటమల్లఁడనునది కేవలము బూచన బిరుదు మాత్రిమే. పై నలుగురు "బూచన కిష్ట శిష్ట సురభూరుహా మూర్తి కిం బుట్టిరాత్మజులని స్పష్టముగ నేయున్నది. రేవయకు బొడ్డ మయ, మల్లయను నిరువురు పుత్రులు గలరనియు నందు గరిడీయాబల మల్ల బిరుదాంచితుఁడగు బొడ్డమయ హరి హర, భాస్కరాలయము లను చెఱువులను నిర్మించెనని వచించిరి. నిజమునకు రేవయ భార్య పేరు బొడ్డమ. వారిరువురకును జ్యేష్ఠపుత్రిమ మను నిభుఁడగు మల్లన పుట్టెను. ఈతఁడే గరిడీయాబల మల్ల బిరుదాంచితుఁడు, మఱియు

హరి, హర, భాస్కర గృహములను నిర్మించి, బృహత్తటాకము నొక దానిని త్రవ్వించినవాఁడు. శాసనము మొట్టమొదటివైపున వేమబోల బొడ్డమ మల్లెనాయకుఁడని నీతని గూర్చియే గలదు. రెండవవైపున పేర్కొనబడిన మల్ల సముద్రము బహుశః ఆతఁడు దన పేరితో త్రవ్వించిన బృహత్తటాకమే కావలెను. ఇక నాల్గవవైపు 132 34 పంక్తులలోగల "శక మహీపాలాబ్ద నికరంబు నయనజలనిధి నభోవిధు సంఖ్య" యను కడుముఖ్యమైన శాసనకాలమును వారు గుర్తించనే లేకపోయిరి. రెండవవైపున సరిగానిదియే శకవర్షములు ౧౦౪౨ అనియు మొదటివైపు చాళుక్యవిక్రమకాలము ౪౫ శార్వరి యని స్పష్టముగ పేర్కొనఁబడియున్నది.

వెనుకఁ బ్రకటించిన గూడూరు శాసనమునకును దీనికిని చాల పోలికలు గలవు. రెండును ఒకేలిపిలో పశ్చిమ చాళుక్య త్రిభువన మల్లుని కాలమునఁ జెక్కఁబడినవి. వానికాలము రెండింటను చాళు క్యవిక్రమ వర్షములలో మొదట పేర్కొనబడినది. త్రిభువనమల్లుని సామంతులు మహామండలేశ్వరులగు చాళుక్య కుమారసోమేశ్వర, కాకతిప్రోలరాజుల సేనాధిపతులగు విరియాలమల్లు, వేమబోలమల్లు లను వారలుఁ వరుసగచే గట్టఁబడిన ఆలయముల కిచ్చిన దానము లను దెల్పుటకే రెండుశాసనములు నుద్దేశించఁపడినవి. వారి వంశవృ క్షములను దెల్పుచు రెండింటియందును వారివారి పూర్వులొనరిం చిన ఘనకార్యములలో నొక్కటియగు గాకతిచిన్నబేతరాజు శత్రువు లను నిర్జించి కాకతిరాజ్యమును సుస్థిరముఁజేసి వానినుండి పొందిన బహుమతులు వర్ణించఁబడినవి.

నాఁడు గూడూరుప్రాంతము కుమారసోమేశ్వరుని పాలనము లోని కొలనుపాక మండలములోనిదగుటచే ఆశాసనము మూఁడువం తులుకన్నడమునను ముఖ్యమగు విరియాలవంశజుల ప్రశస్తిమాత్రము

తెలుగు పద్యములలో నున్నది. మాటేడు కాకతి రెండవప్రోలరాజు పాలనములోని అనుమకొండ విషయములోనిదగుటచే మేడబోల మల్లయ శాసనమంతయు చక్కని తెలుగుభాషలో గలదు. గూడూరు శాసనమున మొదటి రెండువైపుల శాసనప్రధానోద్దేశ్యమెట్లు వివరింపఁబడి వ్యాసగీతములతో పూర్తిగావించి మరల మూఁడు నాలుగు వైపుల శాసనదాత వంశప్రశస్తి యున్నదో ఈమాటేడు శాసనమున గూడ సరిగా నట్లే యున్నది. గూడూరు శాసనమున నాలుగవవైపు శాసనాంతమున "సూత్రధారి కొమ్మోజన బరహ శ్రీ శ్రీ శ్రీ అదప గట్టు దేవరకు జేసు" అనునట్లిందు "నారాయణదేవరపాలము మందన ప్రేదతంకనవ్రాలి"ని మూఁడవవైపు శాసనదాత వంశప్రశస్తి యారంభమునసే వ్రాయనకాని పేరుగలదు. కవిపేరు రెండింటను గానరాదు. గూడూరు శాసనపు తెలుగుపద్యములకంటె నిందలివి నిర్దుష్టముగ చక్కని శైలిలో నున్నవి. మాటేడు శాసనమునందలి మొదటివైపున గల త్రిభువనమల్ల. కాకతిప్రోలరాజులప్రశస్తి సరిగా నాటికన్నడ శాసనములలో గలదానికిఁ దెలుగు సేత. అంకుపృథివీశ్వర, ద్రవిడ, గిరిధాత్రియనియుండినట్లే యిందుగూడ పృథ్వీవల్లభ, నిర్వాణాం,గిరిహ యిత్యాదులు గమనించఁదగినవి. ఈరెండు శాసనములకు కాలవ్యవధి సుమారు నాలుగు సంవత్సరముల పదిమాసములు.

ఈ శాసనకాలము మొదటి, రెండు నాల్గవవైపుల మూఁడు మార్లు మూఁడు విధములలో నున్నది. మొదట వారి సార్వభౌముఁడగు పశ్చిమ చాళుక్య త్రిభువనమల్ల బిరుదాంచితుఁడగు నాఱవవిక్రమాదిత్యునిచే నూతనముగా నారంభించబడిన చాళుక్య విక్రమశకము ౪౫గి శార్వరియని తెల్పి దానికి సరియగునది యాఁకాఁడా ప్రాంతమున సామాన్యముగా వాడుకలోగల శకవర్షములు ౧౦౪౨ అనయన, జలనిధి నభోవిధుసంఖ్యయని గూడ పేర్కొనినాఁడు. నాటి యా ప్రాంతపు

వారి శాసనములలో సాధారణముగ నీచాళుక్య విక్రమవర్షమునేగాని శకవర్షము లెచ్చటను పేర్కొనఁబడి యుండలేదు. ఇంమ రెండునుండుట యొక విశేషము. దీనికి కారణము బహుశః కాకతి ప్రోలరాజు, నతని సేనానులు క్రమముగ స్వతంత్రాంధ్ర సామ్రాజ్యమునకు పునాదులు వేయు నుద్యమములో నుండుటయే కావచ్చును శకవర్షము ౧౦౪౨ శార్వరి చైత్రశుద్ధ సప్తమి శనివారము క్రీ. శ. 1120 మార్చి 8 కి సరిపోవును. ఆనాడు సోమవారముగాని వడ్డవారము కాదు.

పులింద వంశజులను గూర్చి దెల్పు శాసన మింతవఱకుపలబ్ధమైనదిది యొక్కటియే. దానినే వేమబోల లేక బొల్లయని గూడ వచించెను. 'బోయల' రూపాంతరమే 'బోల' లేక 'బొల్ల' కావచ్చును. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులను గాచుటకు వీరు బ్రహ్మచే సృష్టించబడిరనుటనుబట్టి, బహుశః క్షత్రియులేమో! ఈశాసనమున ఆ వంశములో బుట్టిన బూచన, అతని పుత్రులు మనుమఁడు మల్లయ్య మొత్తము మూఁడు తరములవారు మాత్రమే పేర్కొనఁబడిరి. ఈ వంశమునుగూర్చి లేదా వీరిని గూర్చిన ప్రశంస మఱియేయితర శాసనములలో నింతవఱకుఁ గానరాదు. ప్రతాప, సిద్ధేశ్వర చరిత్రములలోనే యెఱుక రాజులనుగూర్చి కొంతకలదు. సిద్ధేశ్వర చరిత్రమున శ్రీశైల నివాసుఁడు, శూరుఁడు. దేవేంద్రుని మించిన వైభవముగల యెఱుకు దేవరాజను కిరాతుఁడొకడు అరణ్యసంచారార్థమై తన యనుచరులతో ననుమకొండకు వచ్చి దాని సౌందర్యమును జూచి వెఱగంది యచటనే స్థిరనివాసమేర్పఱచుకొనినట్లు తదుపరి యాతని పుత్రులు అనుమడు, కొండడు, గర్గభైయుఁడనువాడు నూటయెనుబదియాఱు సంవత్సరములు రాజ్యముసేసి నట్లును వర్ణించఁబడియున్నది.

"యఱుక దేవరాజు యను కిరాతకుఁడు
సరకుగొన దేవరాజు సరిగాఁడటంచు

శ్రీశైలమలవాస దేశికోత్తముఁడు
శూరుఁడు, మారుఁడు, శుద్ధగంభీర
సారుఁడు,విపిన సంచారుఁడై వచ్చి
తన చారులును దానుఁ దగ హనుమాద్రి
సాను దేశంబుల సంచరింపుచును
గిరియు తనకాధారముగఁ జేరి యచట
సురుచిరస్థలములు చూచి వెఱఁగంది
సిద్ధ జాగ్రిత్ స్థలసీమని తెలిసి
సిద్ధేశుఁగొలుచుచు సేవింపుచుండె.
అతనికి సనుమఁడు, కొండఁడు. నాఁగ
నుతిమీర గల్గరేయుండు సనంగ
నూట యెన్బదియాఱు నొగి వత్సరములు
పాటించి యేలిరి బాగుగాఁ బృథ్వి."

అందలి యనుమఁడు, కొండఁడు యనువారి పేరనే నేటి యనుమ కొండ పట్టణము నిర్మించబడినదను నైతిహ్యము స్థానికముగ నున్నది. తదుపరి కాకతిరాజుల వంశకర్తయను సోమదేవరాజు భార్య గర్భిణి యగు సిరియాలదేవి యామె భర్త యుద్ధమున మృతినొందిన కారణ మున సనుమకొండకు వచ్చి యెఱుకదేవరాజును శరణుచొచ్చుట, కటక బల్లహుని భయముచే నాతఁడు నిరాకరింప బ్రాహ్మణోత్తముఁడగు మాధవశర్మ యామెను పుత్రికవలె నాదరించి సంరక్షించుట; పిదప నామె గర్భమున మాధవవర్మయను పుత్రుఁడుదయించి పద్మాక్షీ దేవి వరప్రసాదమున దివ్యాయుధములు, వరములను బడయుట, అది విని యెఱుకదేవరాజు భీతిలి పిక్కలిచ్చి వగచుచుండ మాధవశర్మ అనుమ కొండ రాజ్యమును వానికిచ్చివేసి వారిని మరల అమరసాభూములకు పొమ్మనినట్లు గలదు.

"మీరు పరాక్రముల్ మీరలు దేవ
భూదేవ వరులను బోషింతు రెల్లెడల
వేదసేవకు నిప్రవృత్తుల యెడల
వెరవొప్ప మీ రాజ్య విభవంబు చెల్లెఁ
గరమొప్ప (?) శ్రీకర మొప్పఁగాను
అమరసాభూముల కరుగుఁడు మీరు
కొమరొప్ప నుండుఁడు కొదవలేదందు"

ప్రతాపచరిత్రమున 'అమరవాది రాజ్యమ'ని యున్నదట. అమరవాది ప్రస్తుతము మహబూబునగరు జిల్లాలోని అమ్రాబాదు ప్రాంతము కావచ్చును. కాని యీ ప్రాంతమున గూడ నీ యెఱుక రాజుల శాసనములెవ్వియు నింతవఱకుఁ గానరావు. మాఁటేడు శాసనములోని పుళింద లేక వేమబోల వంశజులకు నీప్రతాప, సిద్ధేశ్వర చరిత్రములలో వర్ణించబడిన యెఱుక దేవరాజుల వృత్తాంతమున కేమిదైన సంబంధముగలదో, అసలు వారి వృత్తాంత మెంతవఱకు సత్యమో తెల్పుటకు వలనుపడదు.

ఈ శాసనపు మూఁడు నాలుగు వైపుల గల నాలుగయిదు తెలుఁగు పద్యములలో పుళిందవంశజుఁడు బూచనపుత్త్రుఁడగు రేవని పరాక్రమాదు లుగ్గడింపఁబడినవి. అందాతఁడు నన్న చేత భూపతి నిజ రాజ్య వర్ధనుఁడనియు, గాకతి రాజులఁ జేకొని వారి చాయల నిర్జించి రాజ్యంబు నిలిపి యనేక గ్రామములు బిరుదులు వారలచేఁ బడసినట్లు గలదు. గూడూరు శాసనమున గల నాలుగవవైపు తెలుగు పద్యము లలో తండ్రి, కొడుకులగు విర్యాల యెఱ్ఱనృప, సూరయలు గావించి నట్లు వర్ణించఁబడిన ఘనకార్యము గూడ సరిగానిదియే. అందు గాకతి చేత రాజునకు విశేషణములుగా గల 'బొట్టు,' 'పిన్న', 'రవ్వ' యను శబ్దములును నిందలి 'నన్న' యనునదియు నన్నియు సమానార్థకములు

దీనిని బట్టి యీ బేతరాజు మిక్కిలి పసివాఁడని గాని లేదా యాతని తాత, తండ్రిలలో నెవ్వరోయొక దొడ్డబేతరాజు ఉండుటచే నీతని నిట్లు వ్యవహరించి యుండవచ్చును. మనకిప్పటికిఁ దెలిసినంతవఱకుఁగాక తీయులలో తాత మనుమలగు నిరువురు బేతరాజులుగలరు. మొదటి ప్రోలరాజు తండ్రి యొకబేతరాజు, పుత్రుఁడొక బేతరాజు. వీరినే చరిత్రకారులు మొదటి బేతరాజు, రెండవ బేతరాజని వ్యవహరించెదరు తాతయగు మొదటి బేతరాజు జీవించియుండ రెండవవానిని చిన్న బేత మనుమ బేతఁడని వ్యవహరించుట సమంజసమే. కాని ఈ రెండవ బేత రాజు శాసనములు కొన్నిగలవు. వానిలో నెక్కడ చిన్న, పిన్న, బొట్టు ఇత్యాది పదములతో నాతఁడు పేర్కొనఁబడి యుండలేదు. మఱియు నాతనితండ్రి మొదటి ప్రోలరాజు నాఁటినుండియే వారు పశ్చిమచా ళుక్య త్రిభువనమల్లుని సామంతులుగనుండి వారియుద్ధములలోఁ బా ల్గొని వారినుండి యనుమకొండ విషయమును శాసనబద్ధముగ పొంది నట్లు స్పష్టముగఁ దెలియుచున్నది. కాన రెండవబేతరాజు పుట్టుకతోఁ డనే త్రిభువనమల్లుని మాండలికుఁడయ్యెను. గూడూరు శాసనములో చెప్పబడినట్లాతని కానాఁడు వేలుపుగొండ, కోఱవి దేశములతో సంబం ధమున్నట్లు గానరాదు. కావున నీమాటేడు, గూడూరు శాసనములలోఁ బేర్కొనబడిన గాకతిచిన్నబేతరాజు మొదటి బేతఁడనియే నా యభి ప్రాయము.

గూడూరు శాసనమున వర్ణించబడిన ఘనుఁడు, బల్లవరాయుఁ డగు కాడయనాయకుఁడే మాటేడు శాసనమునఁ గాకతిరాజులదాయ లని పేర్కొనఁబడియుండవచ్చును. దీనినిబట్టి యాతఁడు కాకతీయుల జ్ఞాతికావలయును. అయినను నీపల్లవరాయునిగూర్చి యింకను స్పష్టము గఁ దెలియదు. మాటేడుశాసనమున "కాకతిరాజులం జేకొని దాయల నిర్జించి రాజ్యంబునిలిపె'ననుటచే గూడూరు శాసనములోని 'కాకతి

నిల్పుట కోటిసేయదే యనునది కాకతిరాజ్యమును లేక రాజులను
నిల్పుటయేనని స్పష్టమగుచున్నది. ఈ ఘనకార్యమునకై వేమబోల
రేవయ, విర్యాల ఎఱ్ఱ, సూరయలు కాకతిరాజులనుండి కొన్నిగ్రామ
ములు, బిరుదులిత్యాదులు ప్రతిఫలముగఁ బడసినట్లు రెండింటియందుఁ
గలదు. గూడూరుశాసనమున విర్యాలవారు పొందిన మొగడుపల్లి,
నేరెడు, బోటిపాడు, ఉసుమావిడి యిత్యాది గ్రామముల పేర్లుగలవు
కాని ప్రస్తుత మాచేడు శాసనమున రేవయకిచ్చిన వేమియుఁ బేర్కొ
నఁబడలేదు. బహుశః ఈపుళిందవంశజుల దేశములో నిదియగు నీమా
చేడు గ్రామము సరిగా నాఁటికొఅవిదేశములోని దేయగుటచే ప్రాయి
కముగ వారినుండి పొందినదే నవియూహింపవచ్చును. రేవయ దారిద్ర్య
వైరి, మన్యరేవఁడి ఇత్యాదిబిరుదులు ఆసందర్భమున బడసినవే కావలెను.

వెనుక నేను గూడూరు శాసనమునఁ జేసిన సమన్వయమునకీ
మాచేడు శాసనము మిక్కిలి తోడ్పడుచున్నది. మల్లన గట్టించిన హరి,
హర, భాస్కరాలయములు ప్రస్తుతము ఈశాసనము పడియున్న
యావరణలోగల శివ, విష్ణ్వాలయములే యనుట నిస్సంశయము. కాక
తీయుల కాలమున శివ, విష్ణు, సూర్యదేవుల నొక్కచో బ్రతిష్ఠించుట
రుద్రునివేయిస్తంభాలగుడి, కటుకూరు, ఖాజీపేట మున్నగు ననేకశా
సనములలోఁ గాన్పించును. వీరినే త్రిపురుషులు, త్రిపురుషతీర్థ మనియు
శాసనములలోఁ బ్రశంసించుట గలదు. ఈ శాసనము రెండవవైపున
పేర్కొనఁబడిన మల్లసముద్రము మల్లనతన పేరితో త్రవ్వించినట్టి
దియు ప్రస్తుతము మాచేడులోగల మల్లన్న చెఱువు గావచ్చును.

---

# గూడూరు శాసనసమన్వయము.

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

కాకతీయ సామ్రాజ్య ప్రారంభమును గూర్చిన విషయమును దెలుపు శాసనములలో ప్రధానములయిన శాసనములు రెండు. దానిలో మొదటిది గూడూరు శాసనము. రెండవది ఖాజీపేట శాసనమును. దీనిలో గూడూరు శాసన మింతకుముందు తెలింగానా శాసనసంపుటము ౧ లో ఖండ ఖండములుగా ప్రకటింపఁ బడినది. ఆశాసనము గూడూరులోనుండిన శిలాశాసనస్తంభమునందు నాల్గవవైపున చెక్కఁబడియుండిన కారణమున, దానిని మిగిలిన మూఁడువైపులనుండిన శాసన విషయములతోఁ గలిపి చదువుట కనువుగ, శాసన ప్రతిబింబములను దీయించి, శ్రీ శే. హెచ్. విశర్మగారు పరిశుత్పత్రికలోఁ బ్రకటించుటకుఁబంపఁగా, కడచిన 50. సం.5-6 సంచికలలో, వారి వివరణ వ్యాసముతోసహా మరల ప్రకటించియుంటిమి. ఖాజీపేట శాసనము, తెలంగానా శాసనములు అవసంపుటములో ప్రతిబింబములతోసహా ముద్రితమైయున్నది. ఈగూడూరు శాసనము బయటఁబడినది మొదలు, అనఁగా నించుమించుగ ముప్పదియేండ్లనుండియు నీ శాసన సమన్వయము వివాదాస్పదముగనే నిలిచిపోవుచున్నది. శ్రీహర్షవర్ధన శర్మగారు శాసనాక్షరములను బాగుగ గుర్తించి, చాలవఱకు తప్పులు సవరించి,మంచి పాఠమునే వెలువఱించినారు. వారి శాసన సమన్వయ పద్ధతియుఁ జాలవఱకు సరిపడియే యున్నది. కాని కొన్నియంశములలో సమన్వయమెట్లు సరిపడునా? యనిపించుచున్నది. ఆవిషయమున నాకుఁ దోఁచిన అభిప్రాయములు పాఠకులయెదుటఁ బెట్టెదను.

గూడూరు శాసన శిలాస్తంభము, నాల్గవవైపున 5 తెలుఁగు పద్యములతోఁగూడి, విరియాల వంశప్రశస్తితోపాటు, వారు కాకతి బేతనికి సాయముచేసి, వానిని కోఁటవిదేశములోని వేలుపుకొండలో

మరల నిలుపుటను తెలుపుచున్నది. మిగిలిన మూఁడువైపులఁ జెక్కఁబడి యున్న శాసన విషయములతోఁ గలసి, యిదియంతయు నొక కాలము నకే చెందినదనియు, విభిన్నమైనయుపక్రమములతోఁ గూడియున్నను నాలుగువైపులనుండిన శాసనవిషయ మంతయు నేకసూత్రతగలది యనియు శర్మగారు తెలిపిన విషయము సరిపడియున్నదని యే నా యూహ. తెలంగాణములో నీనాఁడును నిలిచియున్న పెక్కు శాసన శిలాస్తంభములలో విభిన్నోపక్రమములు కానవచ్చినను, ఆశాసనము లొకేవిషయమునకు, ఒకే కాలమునకుఁ జెందియుండుట తఱుచుగఁగాన వచ్చుచునేయున్నది. అలీరులోని కుమార సోమేశ్వరుని యీగూడూరు శాసనము చాళుక్య విక్రమ-సం. ౪౮ నాఁటిదగుటచే క్రీ. శ. 1124 నాఁటిదని నిరూపించి, దానికి సమర్థకముగ, కుమారసోమేశ్వరుని గూడూరు శాసనము వంటిది, విషయైక్యముగలదియునగు కొలనుపాక శాసనమునుగూడ నుదాహరించియున్నారు.

గూడూరు కొలవి దేశములోనిది. గూడూరునకు సమీపము నందున్నది బమ్మెర. దానికొక యామడమేరలో నుండినది వేల్పు కొండ (నేటి జఫర్ గఢ్.) వేల్పుగొండ ౨౪ లోనిది బమ్మెర అని ఈగూడూరు శాసనము రెండవవైపు నందుండిన కన్నడవాక్యములు తెలుపుచున్నవి. దీని నానుకొనియున్నదియే కొలనుపాకమండలము. వేల్పుకొండ ౨౪ సంఖ్య, కొలవిమండలము 24 గ్రామములు కావల యునని తోఁచు చున్నది. ఈనాఁడు కొలవి గూడూరు బమ్మెర వేల్పు కొండ వరంగలు జిల్లాకుఁ జెందినవి. కొలనుపాక నల్గొండ జిల్లాకుఁ జెంది నది. కుమార సోమేశ్వరుఁడు పశ్చిమచాళుక్యప్రభువు. అతనికి సామన్త దండనాథుఁడు కొల్లిపాక యేడువేలకు పాలకుఁడయిన స్వామిదండాధి నాథుఁడు. ఇతఁడే చాళుక్య విక్రమ సం॥ ౪౩లో గుముడూరు సోమే శ్వరునకు బమ్మెరను, చా. వి. సం॥ ౯౦లో, కొలను పాకలోనుండిన

అంబిక యను జైనదేవతకు పానుపురమను గ్రామమును కందూర సోమేశ్వరరుని యనుమతితో దానము చేసినట్లు లీ రెండు శాసనములు తెలుపుచున్నవి. ఈ దాన శాసనములు రెండిటను ప్రస్తుతుఁడైన స్వామిదండాధినాథుఁడు, పశ్చిమ చాళుక్య ప్రభువులకు సామన్త దండనాథుఁడై కొలనుపాక మండలమునకు ప్రధానపాలకుఁడుగా నుండినట్లు తెలియవచ్చుచున్నాఁడు.

ఈ గూడూరు శాసనము రెండవ వైపున, స్వామిదండాధినాథుఁడు గుముడూరు మల్లేశ్వర దేవర అంగ రంగ భోగమునకై బమ్మెరను దానమిచ్చుట, దానప్రశస్తి, మల్లేశ్వరుని మహిమయు పేర్కొనఁబడి, 'వృత్త' అని ముగియుచున్నది. మూఁడవ వైపున 'విరియాలాన్వయసీరజాకరదినేశం' ఇత్యాదిగా నావృత్తమే ప్రారంభింపఁబడి, విరియాలాన్వయములో ప్రసిద్ధుఁడైన సూరని, ఆతని పుత్రుని బేతని, వాని కుమారుని మల్లని పేర్కొని, ఆమల్లఁడు గుముడూరులో మల్లేశ్వర మను పేర తటాకమును వాపులను శివాలయములను నిర్మించినట్లు తెలిపి తుదిని వ్యాసగీతములతో ఆవైపు ముగియుచున్నది. రెండవ వైపున వ్యాసగీతములు లేవని శ్రీశర్మగారు పొరపడుట వ్రాసిరిగాని, అక్కడ దానప్రశస్తిని దెలిపిన శ్లోకముతో సరిపడునదియే నాయూహ. కావున ఏమూఁడు వైపులనుండిన శాసన విషయ మొక్కటియే యగుటలో విరోధము కానరాదు.

ఇటులే మూఁడవ వైపున ప్రారంభములోఁ బేర్కొనఁబడిన విరియాల సూరనివంశము, ప్రారంభమునుండియు, ఆతనికి వెనుకటి నాలుగుతరముల వారిప్రశస్తి, నాల్గవ వైపునఁ బేర్కొనఁబడి, తుదిని మొత్తమీ శాసనము కంతకును లేఖకుఁడైన వాని పేరుతో సహా శాసనము ముగింపఁబడినది. కావున నీశాసనమంతయు నొక కాలమునకే చెందినదనియు, ఇందలి విషయమున నైక్యము కలదనియు శ్రీశర్మగారు తెలిపిన విషయము సరిపడియే యున్నదని నేనును భావించుచున్నాను. ఇఁక నీనాల్గ

వనై పునం దున్న తెలుఁగు పద్యముల సమన్వయ విషయములో మాత్రము కొంత సంశయము మిగులుచునేయున్నది. శ్రీశర్మగారు విరియాల సూరనిమనుమఁడైన మల్లని పూర్తియైనపేరు మల్లేశ్వర స్వామియనియు, అతఁడే గూడూరు కొలనుపాక శాసనముల లోఁ బేర్కొనఁబడిన స్వామిదండాధినాథుఁడు కావచ్చు నేమో? యనియొక సంశయమును వ్యక్తముచేసినారు. కాని యీవిరియాలవారు, వారిప్రశస్తులనుబట్టి వీరులై,పాలకులుగానుండిన వారికి యుద్ధములలో సాయ పడినట్లు, తెలియవచ్చుచున్నారుగాని,వీరేప్రాంతమునకుఁ బాలకులుగా నుండినట్లు తెలియవచ్చుటలేదు. ఒకప్పుడు ఈవిరియాల వంశజులు కొలనుపాకమండలపాలకుఁడుగా నుండిన స్వామిదండాధి నాథున కనుచరులై, కొలనుపాకమండలములో కొంత భాగమున కధికారము గలిగి యుండిన వారేమో ? యని యనిపించుచున్నది. ఈయూహకుఁ గారణము ఈగూడూరు శాసనములోని తెలుఁగు పద్యములందలి విషయమే.

ఆపద్యములలో మొదటి మూఁడిటను దెల్పిన విషయమిది. దుర్జయాన్వయములో చాలమంది రాజనందనులు గడచినతరువాత పోఅంటి వెన్నఁడు పుట్టెను. వానికి విరియాల భీముడు, వానికి ఎఱ్ఱ నృపతియుఁ బుట్టిరి. ఈ యెఱ్ఱనృపతి చిన్నవాఁడైన శేతభూపాలుని చేతఁబట్టి, వాని శత్రువును జంపి, ఆ కొఅవిదేశమునందు నిలిపి, వాని నుండి యేదియో కొంతెభాగమును ప్రతిఫలముగాఁ బొందినట్లు 'తత్త నెయురు పేరుపొడగల దాయము బిట్టఱగద్యనంబు, వానిచే, మొగడు పల్లియు వంద్రదు నేలునప్పుడే' అనువాక్యములు చెప్పుచున్నవి. ఈ తుదివాక్యముల కర్థము సరిగా కుదిరినఁగాని ఈ పద్యములోని విషయ మునకు సంశయము తీరదు. ఎఱ్ఱఁడు దుర్జయవంశము లోనివాఁడనియు నీ శాసనము చెప్పుచున్నది. కాకతీయులు దుర్జయ వంశములోని

వారని వారిశాసనములు చెప్పుచున్నవి. కావున విరియాల ఎఱ్ఱడు, కొఱవిమండలమునకు సామన్తదండనాథుఁడుగావచ్చి పాలించుచున్న కాకతిబేతనిమీఁదికి శత్రువులు దండెత్తివచ్చినప్పుడు, బాంధవ్యమును బురస్కరించుకొని యెఱ్ఱఁడాతని రక్షించి, మరల కొఱవిదేశమునందు నిల్పె ననువిషయమును 'ఆ కొఱవిదేశమునందు ప్రతిష్ఠచేసి' అనువాక్యముచే నూహింపవచ్చుననుకొందును. ఆ యుపకారమునకు బదులుగ మొగడుపల్లియు, పంద్రడు' ఇవి కొఱవిమండలములోని గ్రామములైనచో, బేతనినుండి గ్రహించియుండవచ్చును.

ఇఁక దీనిలో నాల్గవపద్యమున కర్థము పొసగుట చాలవివాదాస్పదముగనే యున్నది. ఈ పద్యమే కాకతిబేతనికి విరియాలవారితోఁ గలసంబంధమును దెల్పునది. ఆపద్యమిది.

అరుదగునట్టి ఎఱ్ఱనృపునంగన కామసాని యొకమే
ల్గరుడని బేతభూవిభుని గాకతివల్లభు బిన్నవాని దా
బరగగ జేతబట్టి ఘనుం బల్లవరాయని యోగిజొచ్చి భా
స్కరవిభు చక్రవర్తిగని కాకతి నిల్పుట గోటిసేయదే.

ఎఱ్ఱనిభార్య కామసాని చిన్నవాఁడు కాకతిప్రభువు అయిన బేతభూపాలుని చేతఁబట్టి, పల్లవరాయనితో ప్రతిజ్ఞచేసి, సూరఁడను వానిని కని (ప్రసవించి) కాకతినిల్పుట కోటిసేయదా? అనఁగా కామసాని విభుసూరని గనుటచే కాకతిబేతని నిల్చినదని శర్మగా రర్థముచేసి యున్నారు. ఓగిజొచ్చి = ప్రతిజ్ఞచేసి - అనునర్థమును శ్రీ శర్మగారు గ్రహించినారు. పల్లవరాయని-అని ద్వితీయా విభక్త్యంతపద మైనచో ఓగిజొచ్చి-అని విడఁదీయుట కుదురదు. పోనీ శాసనభాషగనుక ద్రుతప్రకృతికముమీఁద యడాగమ ముండకూడదా? యని ప్రశ్నింపవచ్చును. కాని ఇచ్చటి పద్యములలో కళాద్రుతప్రకృతిక విభాగము చాలవఱకు సరిగా పాటించినట్లే కానవచ్చుచున్నది. అదియునుగాక

కామసాని కనినప్పుడే చక్రవర్తియైన సూరని గనుట సరిపడునట్లు తోఁపదు. కనుటకు(ప్రసవించుటకు) కాకతి నిల్పుటకును కార్యకారణ భావము సరిగాకుదురదు. ఆనాఁడు చక్రవర్తిగానుండిన వారు, ఆప్రాంతముపై నధికారముగలవారు పశ్చిమచాళుక్యులే. అందుచే కామసాని కని=చూచి. అని యర్థమే చెప్పవలెను. భాస్కరవిభున్=అమదాసికి ఆదిత్యశబ్దసమన్వితుఁడైన విక్రమాదిత్యుని అనిచెప్పుటయే యుక్తమని తోఁచును. విరియాల యెఱ్ఱఁడు, దివికేళగఁగా, బాంధవమును బుర స్కరించుకొనియే కావచ్చును, ఆతనిభార్యయైన కామపసాని చిన్న వాఁడైన కాకతి బేతని చేరఁబట్టి. విక్రమాదిత్యప్రభువును దర్శించి, కాకతి బేతని కొఱవిదేశమునకు ప్రభువునుగా నిల్పుట కోటిసేయుదే ? అని యర్థమనుకొనిన సరిపడునేమో? విమర్శకులు పరిశీలించెదరుగాక!

ఇఁక సీసపద్యములోనే 'ఘనుబల్లవరాయునిరోగి' అనుచోట మూలములో ఉన్న అక్షరము 'రో ?' లేక 'యా ?' లేక మఱి రొుక యక్షరమా ? స్పష్టముగ నూహించుటకు ఏలుపడకున్నది. ఒక ప్పుడు, పల్లవరాయునిరోగిన్, అని విడఁదీసి, పల్లవరాయుని యధికా రిని, చోచ్చి=అనుసరించి, చక్రవర్తియైన విక్రమాదిత్యుని దర్శించి, కాకతి నిల్పుట మంచిదికాదా? అనునర్థము చేసికొనవలెనా? ఇంతకు కొఱవిదేశమునకుఁ బాలకుఁడైన కాకతి బేతనిమీఁదికి దండెత్తివచ్చిన వారెవరో ? చోళులో ? పల్లవులో ? కాని ఈశాసన విషయమునకు ఖాజీపేట శాసనమును శోధించిచూచినచో, మొదటిబేతనమీఁదికి దండెత్తివచ్చినవారు చోళులని తెలియవచ్చుచున్నది. మఱియొక్క మాట. ఈశాసనములోఁ చేర్కొనఁబడిన కాకతిబేతఁడు మొదటి బేతఁడగునా కాదా? కాకతిపుర మనునది అనుమకొండ యేకాక మఱి యొకటి యగునెట్లు? ఇత్యాదిగా సంశయము లెన్నియో నిలిచియు న్నవి. వానికేమయిన యీ శాసన విషయము పరిష్కారకమగునా ? యను విషయమున నాయూహను కొంత వివరించెదను.

ఈశాసనమునందలి యయిదవపద్యమునుబట్టి సూరఁడు, కాకత కాలుఁడైగాడయనాయకునిజంపి, వేలుపుకొండలో నుండెడి చిన్నపృథువును వేలుపుకొండలోనే నిలిపి, వానినుండి తాను చేసినదానికి మేలుగ మూడముప్పయిని, నేరెడు, బోదిపాడు, ఉకుమావిళ్లు, కెంజెయరాజు సంగడ్లు స్వీకరించెనని యూహింపనగుచున్నది. ఈపద్యములో తుదిని పేర్కొనినవి గ్రామము లేయగును. అవి యేయే తావులందున్నవో ? వానివాని నామములెట్లు మాఱినవో గుర్తించినచో ఇచటి చారిత్రిక విషయము స్పష్టము కాఁగలదు. ఈ పద్యముల కర్థమును నిర్ణయము చేయుటలో 'నగును కాదు' అనుకొనుటకంటె, ఆయాతావులు తిరిగి, ఆయాప్రదేశముల నిర్ధారణముగావించిన విషయనిర్ణయము సులభమగునని నాయపేక్ష. వేలుపుకొండ కొలనిమండలములో నిదనుట స్పష్టము. కొండలతోఁజుట్టువాఱిన ప్రాచీనదుర్గ మదియని, అచట రాష్ట్రకూటులనాటి శాసనములున్నవని శ్రీ శర్మగారే అక్కడికి పోయి చూచి తెలిపియున్నారు. కాపున కాకతిబేతనికి రాజధాని వేలుపుకొండయే యగును. కొలనిదేశము ౨౮ గ్రామములుగల చిన్నమండలముగావున, దానికి పాలకుఁడుగా, పశ్చిమచాళుక్య సామన్త దండనాథుఁడుగా, అవతరించిన కాకతిబేతఁడు రవ్వనృపుఁడు=చిన్నపాలకుఁ డగుటయు సరిపడుననియే యనిపించుచున్నది. తుదిపద్యములో సూరనప్రశస్తి పేర్కొనఁబడినది గావున, ఈతఁడు విరియాల కామపసాని మెఱ్ఱనలకు పుత్రుఁడే గావలయునుగాని యన్యుఁడు గానేరఁడు. అటులనే మెఱ్ఱఁడు బొట్టుబేతని, కామపసాని కాకతిబేతని, సూరడు రవ్వనృపుని రక్షించినారని, విభిన్నముగ సమన్వయించుటకంటె, అన్నిటికి నేకవాక్యతా పురస్కృతమైన సమన్వయము కూర్చుకొనుటయే యుక్తమని నాయూహ.

అదియునుగాక ఈశాసనముతో ఖాజీపేటశాసనమును శోధించి

సమన్వయించిచూచిన, కాలమునుబట్టికూడ, కాకతీయులకు మొదటి రాజధాని వేలుపుకొండయనియు, తరువాత వారికి అనుమకొండ రాజధాని యైనదనియు నూహింపనగుచున్నది. ఖాజీపేట శాసనములో కాకతీయుల వంశము మొదటినుండియు నాలుగు తరములు పేర్కొనఁబడినవి. దానిలోని ప్రారంభశ్లోకమిది.

సామన్త విష్టివంశః శ్రీమాన్ కాకతిపురాధినాథో బేతః
చోళక్ష్మాపాళచమూవార్ధిప్రమథన సమార్జితోర్జితలక్ష్మీః.

విష్టిః అనుశబ్దమునకు వెట్టి పనిచేయువాఁడని యర్థము. సామన్తులై ప్రతిఫలము లేకుండ పనిచేయు వంశమునకుఁ జెందినవాఁడు, కాకతిపురమునకుప్రభువు శ్రీమంతుఁడు నగు బేతఁడు చోళరాజుల సేనా సముద్రమును మథించుటచే విస్తారమైన సంపద నార్జించినవాఁడై యుండెనని యీ శ్లోకభావము. అనఁగా బేతఁడు సామన్తదండాధినాథుఁడై చోళరాజసైన్యసముద్రమును మథించి, తత్ఫలితముగ కాకతిపురాధీశ్వరత్వము గల సంపదను బడయఁగల్గెనని యీ శ్లోకము చెప్పుచున్నది. ఈతఁడు మొదటి బేతఁడేయగుటలో సంశయింపఁ బనిలేదు. ఈతని పుత్రుఁడు ప్రోలుఁడనువాఁడు, చక్రకూట విషయమును జయించి, భద్రంగపురాధిపతిని పరుగెత్తించి, కోంకణమండలమును జయించి, శత్రుసముత్సారణముచే విశేషమయిన కీర్తి నార్జించెననియు, అతఁడే కొడ్వర్తి దుగ్గనృపతి కుమారుని యుద్ధములో కడతేర్చి, పురుకూ దేశమును జయించి ఆయా భూములతోఁగూడిన అన్మకొండమండలమును త్రైలోక్యమల్ల భూవల్లభునివలన శాశ్వతముగ శాసనబద్ధముగ పొందెనని పై శ్లోకము తరువాతి రెండుశ్లోకములు తెలుపుచున్నవి.

దీనిని బట్టి కాకతిప్రోలుని సమయములో అన్మకొండ మండలము, కాకతీయులకు వారు సాధించిన విజయములకుఁ బురస్కారముగ లభించెనని తెలియవచ్చుచున్నది. ఈ శాసనమునందే యీ

పోలుని కొడుకు బేతఁడనియుఁ ఇతఁడు, అనుమకొండ పురప్రదేశ మున శివపురమను తీర్థము నిర్మింపఁ జేసెనని, తన పేర బేతేశ్వరాలయ మును నిర్మింపఁజేసెననియు నీ శాసనమునందే పేర్కొనఁబడియున్నది. ఈ శివపురతీర్థనిర్మాణము చాళుక్యాభరణ శ్రీమత్ త్రిభువనమల్ల దేవర రాజ్యపాలనసమయమున జరిగెనని వివరింపఁబడియున్నది. ఈ శాసనశిలపైఁ బడమరవైపునఁ జెక్కఁబడియున్న దానిలో ఈ బేతని పుత్రుఁడు దుగ్గనృపతి శా. శ. ౧౦౧౯ ప్రమాధిసంవత్సర కార్తిక బ ౧౫ నాఁడు గురువైన రామేశ్వరదీక్షితునకు దానము చేసినట్లు వ్రాయఁబడియున్నది. పశ్చిమ చాళుక్య ప్రభువులలో త్రైలోక్యమల్ల బిరుదాంచితుఁడగు మొదటి సోమేశ్వరుఁడు క్రీ. శ. 1040 మొదలు 1069 వఱకు రాజ్యము పాలించెననియు, ఆతని పుత్రుఁడు త్రిభువన మల్ల బిరుదాంచితుఁడగు రెండవ విక్రమాదిత్యుఁడు క్రీ. శ. 1076 మొదలు 1126 వఱకు రాజ్యము పాలించినట్లును, భూలోకమల్ల బిరు దాంచితుఁడైన మూఁడవ సోమేశ్వరుఁడు క్రీ. శ. 1116 మొదలు 1138 వఱకు రాజ్యముపాలించెననియు చరిత్రకారులు చారిత్రకాధార ములను బట్టి నిర్ణయించియున్నారు. ఈ నిర్ణయమును బట్టి లెక్కించి చూచిన, క్రీ. శ. 1050. ప్రాంతమున మొదటి పోలునకు అనుమకొండ విషయము త్రైలోక్యమల్లుని వలన లభించినట్లును, ఆతని తరువాత త్రిభువనమల్ల దేవుని కాలమున రెండవ బేతఁడు, ఆతనికి సామన్త మాండలికుఁడై అనుమకొండ విషయమును పాలించుచుండెననియు. ఈ ఖాజీపేట శాసనమును బట్టి యూహింపవలను పడుచున్నది. అయిన ప్పుడు మొదటి బేతఁడు కాకతిపురవరాధీశ్వరుఁడుగా పేర్కొనఁబడి యుండెను గదా! అప్పుడు కాకతిపుర మేది కావలయును. ఆతని తరువాత మొదటిపోలునితరములోఁగాని వీరికి అనుమకొండ విషయము ఏలు బడిలోనికి రాలేదు. కావున ఆనాఁడు కాకతిపురము వేలుపుకొండయే

కావలయును. ఆనాటికి కాకతిపుర మనుకొనఁదగినది యింకొకటి యేదియు నింతవఱకుఁ గనఁబడదు. కనఁబడినంతలో నీగూడూరు శాసనములోని విషయపర్యాలోచనమును బట్టి వేలుపుకొండయే మొదటి కాకతిపురముగాఁ గనఁబడుచున్నది.

విరియాల మల్లఁడు కుమార సోమేశ్వరుని పాలనమునాఁడు (అనఁగా మూఁడవ విక్రమాదిత్యుని పరిపాలన సమయమున గుముడూరులో మల్లేశ్వర తటాకాదికమును నిర్మించినట్లు గూడూరు శాసనములో మూఁడవవైపునందున్న విషయము తెలుపుచున్నది. ఈ శాసనకాలము క్రీ. శ. 1124. ఈ మల్లనికి వెనుక రెండవతరములోని వాఁడు విరియాల సూరఁడు. మూడవతరములోనివారు కాకతి బేతనిఁ గాపాడిన విరియాల యెఱ్ఱఁడు అతని భార్య కామపసానియును తరమునకు ముప్పదియేండ్ల చొప్పున లెక్కించిన క్రీ. శ. 1010 నుండి 1050 వఱకు, పశ్చిమచాళుక్యులకు సామంతుఁడై దండాధినాథుఁడుగా కొఱవిమండలమును పాలించిన కాకతి మొదటి బేతభూపతిని, విరియాల వంశములోని యెఱ్ఱఁడు కామపసాని సూరఁడు శత్రునిరోధము నుండి తప్పించి కాపాడుట, పరస్పర సహకారములనందుట సరిపడియే యుండునని మన మూహింపవచ్చును.

చాళుక్య విక్రమ సం. 42 క్రీ. శ. 1117 నాఁటి, అనుమకొండ కోటలోని కడలాలయబసది (ఈనాఁటి పద్మాక్షిగుడి) శాసనములోఁ జేర్కొనిన విషయమును బట్టి కాకతి బేతనికి (రెండవవానికి) మంత్రియైన వైజదండాధినాథుఁడు, కాకతి బేతని చాళుక్యచక్రిచరణములు దర్శింపఁజేసి, అతని యనుగ్రహమున సబ్బిసాయరమండలము నాతని పాలనములోనికి వచ్చునట్లు చేసెనని తెలియుచున్నది. ఈ సబ్బిసాయర మనునది, హనుమకొండకు పశ్చిమముగ గోదావరి వఱకు నుండిన ప్రదేశము. ఇది యీనాఁడు కరీంనగరుజిల్లాయని వ్యవహరింపఁబడు

చున్న పరిదేశము. ఈ రెండవ బేతఁడు చాళుక్య విక్రమచక్రి యనఁగా త్రిభువనమల్లుని పాలనసమయమున క్రీ. శ. 1080 నుండి 1115 వఱకు పాలించిన పశ్చిమచాళుక్యప్రభువు కాలమునం దున్నవాఁడు, ఈ సమయమున త్రిభువనమల్లుని యనుగ్రహమున, వైజదండనాథుని మంత్రిత్వమువలన సబ్బిసాయిర మండలము కూడ కాకతీయుల పాలనములోనికి వచ్చినట్లు హనుమకొండ పద్మాక్షిగుడి శాసనమును బట్టి తెలియవచ్చుచున్నది.

ఈ విధముగఁ బరికించిన, కాకతి మొదటి బేతనినాఁడు వారికి కొఱవి దేశము, మొదటి ప్రోలునినాఁడు అనుమకొండ విషయము. రెండవ బేతనినాఁడు సబ్బిసాయిరము క్రమముగా కాకతీయుల యేలుబడి లోనికి వచ్చినట్లు తెలియవచ్చును. దీనిని బట్టి కాకతీయుల మొదటి రాజధాని వేలుపుకొండ, రెండవరాజధాని అనుమకొండ, మూఁడవరాజధాని ఓరుఁగల్లు అయినట్టు లూహింపనగుచున్నది. మఱియు కాకతి మొదటి బేతఁడు మొదలుగా రెండవ బేతని పరిపాలన సమయమునకు, వారి రాజ్యము తూర్పునుండి పశ్చిమమునకు సమానాంతరముగ వ్యాపించినదని కూడ నూహింపనగుచున్నది. గూడూరు కొలనుపాక ఖాజీపేట అనుమకొండశాసనములలోని విషయములను సమన్వయదృష్టితోఁ జూచినప్పుడు, ఒకదాని కొకటి సన్నిహితముగా నుండిన వరంగల్ నల్గొండ జిల్లాలలో సామన్తదండాధినాథులుగా నుండిన, విరియాల వంశములోని వెనుకటితరముల వారు కాకతివంశములో వెనుకటితరము వారికి, సహాయపడి యుండిరను గూడూరు శాసన విషయముకూడ సమన్వితమగుననియే నాయూహ.

కాకతి నుపాసించెడి క్షత్రియవంశ మొకటి యీనాఁటికిని ఉత్కళదేశమం దుండెననియు, ఆ వంశమునకుఁ జెందినవాఁడు కాకతి బేతఁడనియు, అతఁడు మొదటి వీరుఁడైనయోధుడై ఓఢ్రదేశమునుండి

తెలంగాణమునకుఁ జేరి యచట సామంతదండనాథుఁడయ్యెనని యీ నడుమనే నాకు వినవచ్చినది. 'కాకతి' యనునది విద్యానాథుని ప్రతాపరుద్రీయములోని వాక్యములను బట్టి దుర్గాపరమేశ్వరి యగునని నే నీవఱకే వివరించి తెలిపియున్నాను. వేలుపుకొండ యొక దుర్గమే. దుర్గమున కధిష్ఠానదేవతయై దుర్గాశక్తి విగ్రహ ముండక తప్పదు. అట్టి శక్తివిగ్రహ మేదియయిన యొకటి యీనాఁడు మనకా వేలుపుకొండ దుర్గములోఁ గానవచ్చిన, నప్పు డది కాకతిపుర మగునని తప్పక నిర్ణయింప వచ్చును. చారిత్రకవిమర్శకు లీపరిశోధన గావింపవలసి యున్నది. అట్టి శక్తివిగ్రహము వేలుపుకొండలో (జఫర్ గఢ్) లో నుండినచో, 'కాకతి నిల్పుట యనుదానికి, కాకతి యనే దేవతను నిల్పుట, తదుపాసనాపరుఁడైన బేతని నిలుపుట యను రీతిని రెండర్థములు సరిపడవచ్చును. ఇది భావి పరిశోధనలోఁ దేలవలసిన విషయము

ఈ తిరుగ నీ గూడూరు శాసన సమన్వయ విషయమున నాకుఁ బొడకట్టిన యూహలు తెలిపియుంటిని దీనిని సహృదయులైన విమర్శకులు సావధానముగఁ బరికింపఁగోరెదను.

---

## గ్రంథస్వీకారము సమీక్ష

### (శ్రీ బండారు తమ్మయ్య)

(1) దుష్ట సర్పశతకము :- కర్త శ్రీ తాడ్లూరి భాస్కరనారాయణమూర్తిగారు రిటైర్డు ఇంజనీరు కాకినాడ క్రౌను పుటలు 32 వెల -8-0.

దుష్టమానవుని దుష్ట సర్పముతోఁ బోల్చి సులభశైలిలో రచించిన యన్యాపదేశ శతకమిది యని కవి యుద్ఘాటించియున్నాఁడు. "దుష్టసర్పమ విడువుమా దుష్టబుద్ధి" అను మకుటముతో 104 తేటగీతులిందుఁ గూర్పఁబడినవి. అసూయ, ద్వేషము, అకారణముగ పరుల కపకార మొనర్చుటయున్నగునవి దుర్జన లక్షణములు. అట్టి కుజనుల కన్యాపదేశములుగఁ దగిలివచ్చునట్టు లిందలి పలుపద్యములు రచిత మయిన మాట వాస్తవము. సర్పముల లక్షణములు, అవియుండు నెలవులు, వానియాహారములు, ఇవి యవి యననేల వానికి సంబంధించిన యెన్నియో విషయములు, పౌరాణిక గాథలు (రాహుకేతువులు సర్పరూపముతో సూర్య చంద్రులను గ్రహణ సమయములు గ్రసించుట) సర్పకులాధిపతులగు శేష వాసుకి తక్షకాదుల వృత్తాంతముల గూడ నిందేకరువు పెట్టఁబడినవి. అట్టి వృత్తాంత కథనములకు సంబంధించిన పద్యములేగాక మఱి యితరపద్యములనేకములు గూడఁ గవి యుద్దేశించిన యన్యాపదేశ లక్షణమునకు సరిపడవనియే మా యభిప్రాయము. పీఠికాపురాధీశ కళాశాలాంధ్రోపన్యాసకులు శ్రీ జొన్నలగడ్డ కృష్ణమూర్తి ఎం.ఏగారు రచించిన 4పుటల యవతారిక దీనికి ముఖాలంకరణముగ నున్నది. శతకమునందలి గుణములను వారు చక్కఁగ నుగ్గడించినారు. ఇది సంపూర్ణాన్యాపదేశ శతకమను వారి మాట మాత్రము మేము పూర్వోదాహృత కారణములచే నంగీకరింపఁజాలము. మచ్చునకీ క్రింది పద్యములు చూడఁదగును.

క్రూరచిత్తము సహనంబుఁ గుటిలబుద్ధి
గల్గి జీవులఁ బట్టి నిష్కారణముగఁ

బ్రాణములఁ దీసి దుష్కీర్తి వడసెదీవు
దుష్ట సర్పము! విడువుమా దుష్టబుద్ధి (ప 6)
గాలిమేపరి దొరవంచుఁ గబకు బిరుదు
కాని చాలవు నీ కెన్ని కప్పలైన
పీత లెలుకలు మఱి పక్షి పిల్లలైన
దుష్ట సర్పము! ....... (ప 28)
తక్షకాదులు నీదు సోదరగణంబు
కర్మవశమున నాగులై క ద్రువ కశ్య
పులకు నొక వేయి సంతతిఁ బుట్టినారు
ఘోరపాపంబు లెన్నియో వారి పగిది
చేసియుంటివి దుర్బుద్ధి చేత నీవు
దుష్ట సర్పము! ........ (ప 81)

(2) దూతమ త్రైభము :- క ర్త రాయప్రోలు కొ్రను పుటలు 33+3. వెల రు 1-0-0

ఇదిమున్ను భారతి డిసెంబరు 1957 - మార్చి 1958 సంచిక లలోఁ బ్రకటితమయి తరువాతఁ బుస్తక రూపమున మరల ముద్రిత మయినది. "ఇది కాళిదాసకృతి మేఘదూత తెనిగించితి యతికై వ్రాసి ముకై। వెనుకకవిరహాధ్యాన ప్రదీప్తమగు ప్రణయయోగ పరిణతితో పక" అని కవియే కృత్యారంభమునకు ముందు చెప్పినారు. కవియిందు నామ గోపన మొనర్చికొన్నను సుప్రసిద్ధులగు ఆచార్య రాయప్రోలు సుబ్బా రావు గారే యీ కృతికర్తలై యుందురని విశ్వసించుచున్నాము. టైటిలు పేజీ పయిని పేర్కొనఁబడిన వారి యితర కృతుల పట్టిక వలన నిది దృఢమగుచున్నది. విరహాధ్యాన ప్రదీప్తమగు ప్రణయ యోగపరిణతికై కవికి యతిప్రాస విసర్జనముతోపాటు గణవిసర్జ జనము గూడ నెందుకావశ్యకము గాకపోయెనో యూహింపఁజాలము.

ప్రాచీన మర్యాదలను నుల్లంఘించు నుబలాటముతో నిదియొక
వినూత్న రచనా విధానముతో రచించిన పద్యకృతి. రాయప్రోలు
వారి లేఖిని నుండియే యిది వెలువడుట యొక విశేషము. మేఘదూ
తము, దూత మేఘము అను నామముల విడనాడిదూత మత్తేభమని
కవి దీనికిఁ బేరిడుట మఱొక సంస్కారము. అందుకనుగుణముగ నుండుటకే
కాఁబోలుఁ బద్యములన్నియు మత్తేభ వృత్తములలోఁ గూర్చినారు.
పూర్వ మేఘము పేరితో 67 పద్యములు, ఉత్తర మేఘము పేరితో
57 పద్యములు మొత్తము 124 పద్యము లిందున్నవి. జగమెఱిఁగిన
బ్రాహ్మణునకు జందెమేల యనునట్లు సుబ్బారావుగారి రచన గూర్చి
ప్రశంసలనవసరము. కవిగారిందు యతిప్రాసములకై శ్రమింపకున్నను
సప్రయత్నముగనైనఁ గొన్ని తావులనవి దొరలకపోలేదు. మచ్చు
నకుఁ గొన్ని పద్యములు.

> అధికారంబున నేమరిల్లి ప్రభుశాపగ్రస్తుఁడై యక్షుఁడొ
> క్కఁడు, కాంతావిరహార్తితో జనక కన్యాస్నాన పుణ్యోదకం
> బుల ఛాయాతరు వీథులన్ సవయుచుండెన్ రామగిర్యాశ్రమం
> బులలో ప్రజ్ఞలు గురింక భోగ్యమగు వర్షాంతంబు నీక్షించుచున్
> (ప1)

> భువనఖ్యాతము నీదు పుట్టుకపయోదా! పుష్కలావర్తకా
> న్వయ మింద్ర ప్రథమ ప్రవర్తకుడ విచ్ఛారూపి విట్లటచే
> విధిదోషింపగ దూరబంధువుడనై యాచించితినిన్ భాగ్యమా
> సుగుణాభ్యర్థన భంగమేన ధమమన్యంబౌను లాభించియున్ (ప6)

> జలదా సౌహృద వృత్తితో విధురుడంచున్ జాలినో సల్పుమీ
> ప్రియకార్యంబనుకంప నీకనుచితంబైనన్; సుహృత్ ప్రార్థనన్
> జలశాలాడుము ఇష్టదేశముల వర్ష శ్రీ విభాసింప నీ
> సహసౌదామినితో వియోగమునిమే మంతేని రాకుండఁగన్
> (ప122)

మొదటి పద్యమందలి "ప్రజ్ఞలు గుంక" అనునది "అస్తంగమిత మహిమా" యనుదాని కనువాదము కాఁబోలు. శాపపరిమితి యొక సంవత్సరమని సూచించెడి "వర్షభోగ్యేణ" అను మూలపదమునకు "భోగ్యమగు వర్షాంతంబు" సరియగునా? అది వర్షాకాలాంతము వలెనే యనెడి యపార్థమిందువలన ద్యోతకము కాదా? "వర్షాంతంబు నీక్షించుచున్" "అనుటలోఁ గవిగారుద్దేశించిన భావము సువ్యక్తము కాఁజాలదు. "నిరీక్షించుచున్" అని యుపసర్గతో గూడిన క్రియ యుండుటఁ సముచితము. స్వేచ్ఛానువాదము లిట్లుండుట తప్పదని చెప్పవక్కఱ లేదు. మూలకృతి మేఘదూత గుఱించి బంగాళీ విద్వాంసులు దాసగుప్తడే అను వారు ఆంగ్లభాషలో నొసంగిన సవభిప్రాయము History of sanskrit Literature Vol. I నుండి యెత్తి గ్రంథాంతమున నుదాహృతమగుట ముదావహము. ప్రతులు దొరకుస్థానము :- లలితాకుటీరము 44 నెహూ్రునగరు సికిందా్రబాదు.

(3) రూపాంతరకౌముది 1 వ భాగము క్రౌను పుటలు 20 వెల 0-4-0

(4) తద్భవ చంద్రిక 1 వ భాగము క్రౌను పుటలు 20 వెల 0-4-0

(5) ప్రద్యుమ్న చరిత్ర క్రౌను పుటలు 8 పెద్దచ్చు 0-1-0

(6) ఇంద్రద్యుమ్నుని చరిత్ర ,, ,, 0-1-0

కర్త :- కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు రిటైర్డు తెలుగు పండితులు పామఱ్ఱు కృష్ణాజిల్లా

3.4 లు ఇంతకుమున్నిందు సమీక్షింపఁబడిన కవిగారి తత్సమ శతక, రూపాంతర శతకాదులవలెనే పాఠశాలావిద్యార్థులయు ఉపాధ్యాయులయు నుపయోగమునకయి రచితములయినవి. నామములఁ బట్టియే వాని స్వరూపమెఱుంగనగును. మచ్చునకు.

| | | | | |
|---|---|---|---|---|
| 3 నుండి | ప్రకృతి | వికృతి | కుంతాలము | కోదాడు |
| | కులాయము | గూడు | చక్రవర్తి | చక్కురపతి |
| 4 నుండి | శబ్దము | రూపాంతరము | అంకోడము | అంకోలము |
| | అక్షము | అచ్చువు | అల్లుఁడు | అల్లువాఁడు |

5:6.— పౌరాణిక గాథల ననుసరించి బాలుర యుపయోగమున కయి సులభ శైలిలో రచితము లయిన చిన్ని పొత్తములు, ప్రమద్వరరురు మహర్షి పత్ని. సర్పదష్టయై వివాహమునకు మునుపే మృతినొందిన ప్రమద్వరను రురుఁడు తన యాయుర్దాయములో నర్ధ భాగ మొసంగి పునర్జీవితను గావించుట. సర్పకులనిర్మూలనమున కయి యుద్యమించు నాతనినంతకుఁ బూర్వము చిరకాలము క్రిందట ఖగముఖుఁడను సహాధ్యాయుఁడొసంగిన శాపమున దుండుభమయి పడియున్న సహస్రపాదుని యుద్బోధమునఁ దన దుష్కార్యమును విరమించుట 5-వ గ్రంథమందలి వృత్తము.

పుణ్యకర్మాచరణముల వలనఁజిరకాలము స్వర్గనివాస మొనర్చి సుఖంబుల నొందెడి యింద్రద్యుమ్న మహారాజును దేవతలుఁ గొంతకాలమునకు మరల భూమిమీఁదికిఁ ద్రోసివేయ నాతఁడు తన కీర్తి భూలోకమున నింకను స్థిరస్థాయిగ నున్నదని ఋజువు పఱిచి మరల స్వర్గము నలంకరించుట 6వ గ్రంథమందలి యితివృత్తము.

(7) నాప్రభూ (యాదగిరి లక్ష్మీనృసింహశతకము) రచయిత శ్రీ చాల్లేటి నృసింహశర్మగారు రిటైర్డు తెలుఁగు పండితులు. హనుమకొండ తెలంగాణా ప్రెస పుటలు 44+30+12. వెల రు 1-0-0 కవిగారు యాదగిరి నృసింహస్వామి నిష్టదైవముగఁ గొల్చు భక్తవర్యులు. అనన్యశరణ్యా బుద్ధితోఁగష్టసుఖసమయముల రెంటను గూడ నాస్వామిని నిర్వ్యాజభక్తితో భజించు చిత్తస్థైర్యము గలవారు. ఒకే

రీతి మకుటములతోఁ గాక నా ప్రభూ, మత్ప్రభూ, యాదగిరీంద్ర!
మత్ప్రభూ, నృసింహప్రభూ, ఇత్యాదిగా భిన్న భిన్న మకుటములతో
ఉత్పల, చంపక, మత్తేభ శార్దూలవృత్తములలో రచితమయిన పద్యము
లిందున్నవి. కవి యాత్మానుభవములు పలువిధములనిందు వ్యక్తీక
రింపఁబడినవి. ఆపన్నివారణములకు, సుఖజీవన ప్రదానమునకు,
మోక్షప్రాప్తికి, ప్రపంచమున నేఁడు ప్రబలియున్న యశాంతి నివార
ణమునకు దీనికి దానికని యేల సమస్తమునకు నృసింహస్వామినే వర
దునిగా నెమ్మదిని నమ్మి పరి పరి విధములఁ గవి యా దేవునిఁ బ్రార్థిం
చును. నేఁటి శతకములలో నిది యుత్తమతరగతిలోఁ జేర్పఁదగినది.
మున్నుడి, పీఠిక, ఆలోకము, పరిచయము, కావ్యగానము, చర్చ, పం
డిత చ్ఛందము, మున్నగు శీర్షికలతో గ్రంథారంభమునను చివరను
గృతికర్తయేమి, యితర పండితులేమి, సంస్కృతాంధ్రాంగ్లభాషలలోఁ
గావించిన ప్రశంసలు గ్రంథముతో సమానముగ 42 పుటలలో నింపఁ
జేర్పఁబడినవి. అవి గూడ శతకముతో పాటు పాఠకుల వశ్యము పఠింపఁ
దగినవి. ప్రప్రథమమున శ్రీ కారముతోఁ బ్రారంభించిన పద్యములు
మూఁడు గూర్చి చివరను శ్రీకారముతోఁ బ్రారంభ మయిన మంగళ
మహా శ్రీ వృత్తముతో శతకమును ముగించి కవియిందుఁ దమ చిత్త
సంస్కారమున కనుగుణముగ సనాతనాచారమునుచాటించుట ప్రశంస
నీయము.

(8) తెనుఁగు మీగాసా. కర్త:- "రామచంద్ర కౌండిన్య"
అను సాంకేతిక నామాంకితులగు శ్రీ ఓరుగంటి రామచంద్రయ్యగారు
M.A. చరిత్రోపన్యాసకులు, ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు.
క్రౌను పుటలు 40+13+39 వెల రు. 1-4-0, ప్రకాశకులు : ఆంధ్ర
హిందీ పరిషత్తు, హిందీ ప్రచారసభ, హైదరాబాదు.

వైష్ణవ సంప్రదాయము ననుసరించి హిందీభాషయందు శ్రీ రామభక్తిని తులసీదాసు తన రామాయణమునను, కబీరు సూక్తులను, గీతములను, శ్రీకృష్ణభక్తిని మీరాబాయి తన గీతములందును బ్రచార మొనర్చియుంటుట సుప్రసిద్ధము. రాజపత్నిగా నుండిన మీరా మహాభక్తురా లగుట యామె సుకృత పరిపాకము. ఆధ్యాత్మికముగా నామె శ్రీకృష్ణునే పతిగా వరించినభక్తశిఖామణి. భర్తయగు మేవాడు రాణా భోజరాజుతో నామె కాపురము చేసినది స్వల్పకాలమే. అనతి కాలముననే యామెకు వైధవ్యము సంప్రాప్తమయినది. కాని గిరిధర గోపాలకృష్ణుని బాల్యముననే వరించి యధిష్ఠానదేవతగా మనఃపీఠమున నిలిపి యారాధించిన నిత్య సువాసిని యామె. రాధాదేవి భక్తివంటిదే యామె శ్రీకృష్ణభక్తి కూడనని చెప్పుట కెట్టి సంశయమును లేదు. అసంఖ్యాకములగు కృష్ణగీతములచే నామె తనదేశమును, కాలమును భక్తిరస ప్లావిత మొనర్చినది. ఆమె గీతములలో 28 గ్రహించి, శ్రీ రామచంద్రయ్యగారు "మీరా పాట''లను పేరితో ననువదించి, రాగ తాళములఁజేర్చి ప్రకృతకృతిని రచించినారు. మూలగీతములు కూడఁ దెనుఁగుపాటల కెదురుగా నొకవైపున ముద్రితము లయినవి. సరస్వతీ స్తనంధయులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, తాళ్ళపాక అన్న మయ్యగారి కీర్తనలకుంబలె వీనికి స్వరకల్పనము గావించుటయే గాక "పరిచయము'' అను పేరితో 13 పుటల పీఠిక నీకృతికి ముఖాలంకర ణముగఁగూర్చిరి. కృతికర్త రామచంద్రయ్యగారు లౌకికవిద్యాధురీణు లయ్యు దైవభక్తి సంపన్నులు. శ్రీ రమణమహర్షి యాశ్రమమునఁ గొంతకాల ముండి వారి యాశీర్వాదమున ధన్యులయి రమణస్మరణ మున్నగు కృతుల నిదివఱలోఁ బ్రకటించి యున్నారు. వీరి కుటుంబము సహాయ నిరాకరణోద్యమములలో కారాగార నివాసము ననుభవించి దేశభక్తికి దైవభక్తికిఁజిరవిఖ్యాతమయినది శ్రీకృష్ణభిక్షు నామాంకితులు

వేంకటకృష్ణయ్యగారు వీరి యగ్రజులు. కవిగారి సంగ్రహ జీవితము గూడ టైటిలు పేజీ మీఁద నిందు ముద్రిత మగుట ముదావహము. మచ్చునకు రెండు పాటల నుదాహరింతుము.

సింధుభైరవి—మిశ్రచాపు

వలదోయి వలదోయి జోగిపోవ అనుగుఁదమ్ములఁబడి యడలు దాసి పీడి-

అగురుచందనములనలరింతునాచితి చేతులారఅగ్ని దరికొల్పకే యరుగ-

(1) నెగడుమంటలలోన నిలువెత్తునా బూది నిండుకరుణ మెయి నిండుగా నలదకే

మీరా ప్రభు గిరిధర గోపాలక మేళవింపక నీ జోతిలో నా జోతి-

(2) ఎవరే వేరెవరే గిరిధర గోపాలుడుగా కెవరే వారెవరే

తాత మాత భ్రాత బంధులెవ్వరు నావా రెవరే

ఎవని మౌళి శిఖిపింఛము ఎవయు వతఁడె నా పతిగా కెవరే

కులముకట్టులెడ ద్రోచితినేమిసేతు నెవరే నీక సాధుసంగమున

లోకముసిగ్గు లెక్కసేయని నాకెవరే ... చీని దుఃఖాలముల

రోసి ముదుకచేల మాసచేసి ముత్తెసరుల కాదని వనమాల

సంకలింపగ నాకెవరే, అస్రజలము జిలికి చిలికి పెంచితి నొక

ప్రేమలతిక సాగులతాంతములు ఫలము లానందము లందగింప-

ప్రణయము పల్లడిగొనగా మురిసి తరిచి తరిచి మురిసిసంత

రింతువెన్న. చల్లతోపనేమి సామిఁభక్తికినై యీపుట్టువు జగతి

మోహనకలఁజిక్కె గిరిధరప్రభు చరణదాసి మీరాతరియింపఁ జేయ.

(9) మదిరావతీ విలాసము- (పద్య ప్రబంధము) ఆశ్వాసములు 5- డెమ్మీ పుటలు 80, వెల రు.2-0-0- కృతికర్త: వైద్యవిద్వాన్ శ్రీ ద్విభాషి సోమనాథశాస్త్రిగారు - పెద్దాపురము. కృతిభర్త: వైద్యవిద్వాన్ ద్విభాష్యం కాశీవిశ్వనాథముగారు చింతలూరు వేంకటేశ్వర ఆయుర్వేద వైద్యనిలయ వ్యవహర్తలు.

సంస్కృతమున సోమదేవభట్టు రచించిన కథాసరిత్సాగరమందలి మదిరావతీ లంబకంబునఁగల కథావిధానమును గ్రహించి సముచిత కల్పనా సమేతముగ రచించిన మిశ్రప్రబంధ మిది. కృత్యారంభమునఁ గవి యిష్టదేవత యగు శ్రీ కామేశ్వరీదేవిని స్తుతించి, రెండవపద్యమున వేల్పువెజ్జగు ధన్వంతరిని స్తుతించుట వీరి వైద్యవిద్వత్పదమున కుచితముగానున్నది. రచనమంతయు మృదుమధురశైలిలో విరాజిల్లుచు సరస సముచిత కల్పనా శోభితముగ నలరారుచున్నది.

అవంతిదేశ రాజధానియగు ఉజ్జయినీపట్టణమును సోమదత్తుఁడు పరిపాలించుచుండెను. అతని పుత్రి మదిరావతి. జనకుని సైన్యనాథుని సుతయగు రత్నమంజరి యామెవయస్య. ఇరువురు పక్కి సెల్లెండ్రవలెఁ బరస్పర ప్రేమతో వర్తిల్లుచుండిరి. వారి విద్యాభ్యాసమునకుఁ దగిన గురునకై రాజన్వేషించుచుండెను.

పాటలీపుత్రము నేలు గుణభూషణునకు వసంతసేనుఁడను కొమరుఁడుండెను. రాజాస్థానమున మేధానిధి యను పండితుఁ డాతనికి విద్యాగురునిగా నుండెను. శత్రురాజులు గుణభూషణుని పైదాడివెడలి యాతని వధించి రాజ్య మాక్రమింప నాతని సతీమణి భర్తతో సహగమన మొనరించెను. అనాథుఁడయిన రాకుమారుని మేధానిధి విప్రవేషముతో శత్రుమధ్యమునుండి తరలించి యుజ్జయినీపురమును జేరి సోమదత్తునిచేమదిరావతీ రత్నమంజరులవిద్యాగురుఁడుగా నియమింపఁ బడెను. వసంతసేనుఁడును ఉపేంద్రశర్మ యను నామముతో వీరిలో

పాటు మేధానిధికడ శిష్యుఁడయి విద్యలను గఱచుచుండెను. తమకన్న తెలివితేటలుగల యాతని విద్యానైపుణ్యమున కానందించి మదిరావతి యాతని యెడలఁ గ్రమముగ ననురాగబద్ధ యయ్యెను. రత్నమంజరిది గ్రహించియు నుదాసీనముగ నుండెను. కుమారికి వివాహోచిత వయస్సు వచ్చినంతనే యామెయు రత్నమంజరియు అంతిపురమునందే యుండి చదువుకొనవలెనని సోమదత్తుఁ డేర్పాటు గావించెను. వసంతసేనుఁడు మేధానిధి సన్నిధిని విద్యార్జన మొనరించునపుడే పురబాహ్యప్రదేశముల సమరసముచితములగు ధనుర్విద్యాదిక సాధనములం గావించుచు నందును బ్రవీణుఁ డయ్యెను. మదిరావతిని దనకుమారునకిచ్చి వివాహమొనరించుటకై కాశ్మీర దేశపు రాజు సోమదత్తునకు సందేశముఁ బంప నాతండుకూడ హర్షించి యాసంబంధము నిశ్చయించుకొనెను. ఇందుచే మదిరావత్యుపేంద్రుల నిత్య సమాగమము గట్టువడెను. ఆమె యనురాగముఁ దలంచుకొనుచు ఉపేంద్రశర్మ యొకనాఁటిసాయంకాలమున జలజసరోవరముచెంత విరహవేదన ననుభవించుచుండెను. పాటలీపుత్రమునఁ జిననాఁట వసంతసేనుని యనుంగు నెచ్చెలిగా నుండినకళాధరుఁడను క్షత్త్రియాన్వయుండు దేశాటనమునకై వెడలి యుజ్జయినీ పురంబునకరుదెంచి సరోవరముకడ కేఁగ నచట వారిరువురు నొకరినొకరు పోల్చికొనిరి. మదిరావతి వృత్తాంతమువినికళాధరుఁడు వసంతసేనునకు ధైర్యము చెప్పుచుండ నామె చెలికత్తె యొకతె యొక జాబు తెచ్చి యుపేంద్రున కొసంగెను. అది వారిరువురును చదివికొని సంతసించిరి. మదిరావతి వివాహదిన మాసన్నమయ్యెను. పెండ్లివారు వివాహసన్నాహములతో ఉజ్జయినికరుదెంచిరి. కుటుంబాచారము ననుసరించి వివాహమునకుముందుగా మహాకాళేశ్వరు నర్చించుటకయి మదిరావతి సఖీసమేతయై శిబికారూఢయై యాలయమున కేతెంచెను. సఖులనెల్ల బయటనిలిపి యామె యేకాంతముగ గర్భాలయములోనికిఁ జనెను.

అంతకుమున్న వసంతసేనుఁడు కళాధరుఁడు నచటకు జేరి శివలింగము
చాటున దాఁగియుండిరి. కళాధరుఁడు మదిరావతి పెండ్లి యుడుపులను
తానుధరించి పెండ్లికూఁతురురూపముతో బయటకువచ్చి సంజచీకటిలో
నెవరును గుర్తింపకుండఁ బల్లకిలో నెక్కి సఖీసమేతముగ నంతఃపురము
నకు మరలెను. మదిరావతి యుద్యానవనమున సిద్ధముగా నుంచిన
యశ్వముల నధిరోహించి యామెయు వసంతసేనుఁడు ఉజ్జయినీ పట్టణ
మునువీడి పాటలీపుత్రముచేరి యందలి శాఖానగరమునం దెవరును
గుర్తింపకుండ వసించుచుండిరి. రత్నమంజరి యంతకుమున్న కొన్ని
దినములయి తీర్థయాత్రలకరిగెను. కుమారి వివాహము నామె చూచి
యావందింపవలె నను కుతూహలముతో సోమదత్తుఁ డామెను గూడ
రప్పింప నామె మదిరావతితో ముచ్చటింప నంతఃపురములోనికిఁ జనెను.
మదిరావతిరూపములోనున్న కళాధరుఁడామె ప్రసంగములనూకొట్టుచు
మాఱు పలుకకుండెను. తన యాత్రానుభవముల ముచ్చటించుచు
నొక పుణ్యక్షేత్రంబున గంగయందుఁ గ్రుంకులిడి యొడ్డెక్కిన యనంత
రము తానొక సుందరాకారునిఁ గాంచి యాతనియెడ మనంబుఁ జెందితి
ననియు నంతలో నొక మత్తగజ ముద్వృత్తిమై చెలరేఁగి రాఁగఁ
దాను పితృజనంబుల వీడి భయసంభ్రమములతోఁ బరువెత్తి యొక
యిసుకతిన్నెపయిఁబడి మూర్ఛిల, నా పుణ్యపురుషుఁ డరుదెంచి తన
భయంబుడిపి రక్షించి తనవారికడఁ జేర్చెననియు నాతనినే తన ప్రాణే
శ్వరునిగ వరించితిననియు నేకరువుపెట్టెను. అంత మేలిముసుఁగు నించుక
తొలఁగించి యాతఁ డామెను తొంగిచూడ నామె ఆచ్చపడి యాపుణ్య
పురుషుఁ డాతఁడే యని గుర్తించి తత్తఱపడసాగెను. ఇది వెఱపునకు
సమయము కాదని యిరువురు నచ్చటినుండి తప్పించుకొనిపోవు వెరవు
నరయుమని యాతఁడు హెచ్చరించెను. ఆమెయు మదిరావతి జననికడ
కేఁగి "అమ్మా! నాసఖిని మా సౌధమునకుఁ గొనిపోయి యించుక సేప

టిలో మరలివత్తుము” అనిచెప్పి యామెయానతిపయిఁ బెండ్లికూఁతుఁ
దన సౌధమునకుఁ గొనిపోయెను. అనంతర మామె తన సేవకునిచే
నుద్యానవనమున జోకుగుఱ్ఱము లాయత్తపఱుప వానిపై స్వారివెడలి
వారుకూడఁ బాటలీపుత్రమునందలి కళాధరుని స్వగృహమును జేరుకొ
నిరి. పెండ్లిసమయమునకు నంతఃపురంబున మదిరావతిగాని రత్న
మంజరిగాని కానరాక సోమదత్తుఁడును బంధువర్గమును విచార
మగ్నులయిరి. వివాహము నెఱవేఱదయ్యెను.

పాటలీపుత్రములో వసంతసేనుఁడు వసించు శాఖానగర పరిసర
ములలో నతనికి కళాధరునకు నొక సాయంకాలము సమావేశముఘటి
ల్లెను. రాజాంతఃపురమునుండి యెట్లు వెడలివచ్చితివని సంభ్రమము
తోఁ బ్రశ్నించి, వసంతసేనుఁడు జరగిన సంగతుల నెఱిఁగి దైవమ
ట్లనుకూలించినందుకై హర్షించెను.

వసంతసేనుని తండ్రిని యుద్ధమున వధించి పాటలీపుత్రము
నాక్రమించిన శత్రురాజు ప్రజాకంటకుఁడై వర్తించుచుండెను. అతని
మంత్రి వసంతసేనునితండ్రి పూర్వమంత్రికి సన్నిహితబంధువు. పూర్వ
మంత్రిగూడ నపుడు పాటలీపుత్రమునందే వసించుచుండెను. కళాధరుఁ
డాయిరువురు మంత్రులతోను మంతనమాచరించి వసంతసేనుని రాజ్య
మునఁ బ్రతిష్ఠించు నుపాయముల నాలోచించెను. అందఱు సమయ
మునకై నిరీక్షించుచుండ శత్రురాజులు వచ్చి పాటలీపుత్రము పయి
దాడివెడలిరి. వారినెదుర్కొనుటకయి తాను కొంత సైన్యముతో వెడ
లుచు రాజు మూలబలమును కోటలో విడిచిపోయెను. అతఁడు శత్రు
వుల నోడించి మరలి వచ్చునంతలో కళాధరాదులు మూలబలమును
వశపఱచికొని రాజు నెదిరించి సంహరించిరి. ఇట్లు తండ్రి రాజ్యము
వసంతసేనునికి మరలఁ గైవసమయ్యెను. మదిరావతీ వసంతసేనుల
కును, కళాధర రత్నమంజరులకును వివాహములు అతి వైభవముతో

జరిగెను. అనంతరము చారులవలన సోమదత్తుఁడీవార్తలఁ దెలిసికొని తన కొమరిత పాటలీపుత్రి భూనేతకు సతి యగుట కానందించి యల్లుని కనేక సత్కారము లొనర్చెను.

మూలగ్రంథ మందలి యీ యితివృత్తమును గొని కవి సముచితవర్ణనలతో నైదాశ్వాసముల మిశ్రప్రబంధముగా విస్తరించి యీకృతిని సంతరించినాఁడు. కవి సంస్కృతాంధ్రముల రెంటను గూడఁ బ్రవీణుఁడు. తత్పాండిత్యమున కాదర్శముగా ద్రాక్షాపాకమున మృదుమధుర శైలిలో నిది యలరుచున్నది. "కాఁపురించు" మున్నగు నించుకాగమ క్రియలు, కావు, అత్తములు మున్నగు జాతీయ పదములు సముచితస్థలములఁ బ్రయుక్తము లయినవి.

కావునఁబరువొందిఁ కనకవర్ణస్ఫూర్తిఁ గమిసిన ఘన రసాలముల గములు|పండి బీటలువాఱి పసమీఱుకలితంపు టరఁటిపండుల మేలి యత్తములును-

అర్థాలంకారముల కన్న శబ్దాలంకారము లే యీకృతియందెచ్చుగాఁ గనవచ్చుచున్నవి.

మచ్చునకుఁ గొన్ని పద్యములు-

గీ॥ కలఁడతనికొక్క సుకుమారుఁ డలఘురూప
మారు మారుఁడు సుగుణ సంపత్ప్రసారుఁ
డధిక సుకుమారుఁడనుపమోద్యత్ప్రభావి
తానుఁడై మించుచు వసంతసేనుఁ డనఁగ (ఆ 2 ప 3)

కం॥ అరిగి గజరూప దైత్యుని
యరి గిరిశుమహేశుభూతి కాంగ విభాసున్
గురియించి భక్తిం
గురియించి కుమారు మొ్రక్కకొన నియమించెన్
(ఆ-2)

గీ॥ ఏకతమున నుండి "ఏకతమ్మున" వెండి
నెలఁతఁగాంతుననుచు నలఁతఁగాంచి
కలయఁజూచి చెలువకలయట్టు తలపోసి
కలయఁజేరి తెలియఁగల యటంచు (ఆ 3)

శా॥ నిస్తంద్రప్రథనీనుచున్ గ్రమముగా నీరేజినీబాంధవుం
డస్తక్ష్మాధర కూటమెక్కె నెడ నయ్యబ్జాక్షితోఁ గూడి త
ద్వాస్తవ్యస్థలమున్ బవిత్రితలఁ బెద్దం బాటలీపుత్రమున్
విస్తారోత్కలికం గళాధరుఁడు తా వీక్షించె సగ్రంబునన్
(ఆ 4)

చ॥ అసినిశితాస్త్ర కాంతి నిచయంబులె పువ్వులుగా గుణధ్వని
ప్రసరణమే సుమంత్రములఁ బల్కులుగాఁ బ్రతివీరకోటి చా
వసువిసరంబె మేలి యుపహారముగాఁగ మహారథుల్ సము
ల్లసత నెసంగిరందు జయలక్ష్మి నుపాస్తిరొనర్చు కై వడిన్
(ఆ 5)

"కొదవ" యనుటకు "కొదువ", "లేక సింకేనియుఁ జేయ రాక" అనివ్యతిరేకత్వార్థముపై దుష్టము. ఇట్టి ప్రమాదము లందందు దొరలినవి. ఇట్టివి పునర్ముద్రణమున సంస్కరింపఁ దగును.

---

/

# వ్యక్తివివేకము

భాగవతుల కుటుంబరాయశాస్త్రి.

(గతసంచిక తరువాయి)

తా॥ ఇంతయేల క్రియా కారకములుగూడ, ప్రయోగము లేకున్నను ఔచిత్యమువలన భాసించును. మిగిలినపదముల విషయము వేఱె చెప్పవలయునా ?

క్రియ కుదాహరణము :-

మా భవ న్తమనలః పవనోవా వారణోమదకలః పరశుర్వా
వజ్రమిన్ద్రకర విప్రసృతం వా స్వస్తితేస్తు లతయా సహవృక్షః

అర్థము: నిన్ను అగ్నిగాని, వాయువుగాని,ఏనుఁగుకాని, గొడ్డలికాని ఇంద్రుని వజ్రముకాని ఏమియు చేయకుండుఁగాక. ఓ వృక్షమా లతతోఁగూడ నీకు క్షేమమగుఁగాక.

ఇచట అగ్ని దహింపకుండుఁగాక, వాయువు కదలింపకుండుఁగాక. ఈ విధముగ దహించుట మొదలగు క్రియలను దెలుపు పదములను కవి ప్రయోగింపలేదు. అగ్ని వాయు పదముల సాహచర్యమువలననే యా క్రియలు స్ఫురించును.

కారకా ప్రయోగమున కుదాహరణము :

మాధాక్షీ న్మాభాఙ్క్షీత్ మాభైషీత్ జాతుచిత్ బత భవన్తమ్
సుకృతై రధ్వన్యానామ్, మార్గతరో స్వస్తితేఽస్తు సహ లతయా.

అర్థము:-నిన్ను ఎల్లప్పుడును దహింపకుండుఁగాక, విఱిచివేయకుండుఁగాక, భయపెట్టకుండుఁగాక. మార్గమునందలి ఓ వృక్షమా, బాటసారులయొక్క పుణ్యములచే, లతతోఁ గూడిన నీకు క్షేమమగుఁగాక.

ఇచట దహించుట మొదలగు క్రియలకు కర్తలగు అగ్ని మొదలైనవానిని తెలుపు పదములు ప్రయుక్తము కాలేదు. దహింపకుండుఁగాక మొదలగు క్రియలచేతనే యనుమితము లగుచున్నవి.

వాక్యార్థపౌనరుక్త్యము :-

సహసా విదధీత నక్రియా మవివేకః పర మాపదాంపదమ్
వృణతేహి విమృశ్యకారిణం గుణలుబ్ధాస్స్వయమేవ సంపదః

అర్థము:- ఏ పనిని తొందరపడి చేయఁగూడదు. అవివేకము ఆపదలకు నిలయము. ఏలన, గుణములయందు లోభముగల సంపదలు, విమృశ్యకారియగు నతనిని (ఆలోచించి పనిచేయునతనిని) స్వయముగనే వరించును.

ఇచట సహసాకార్యకరణమే వాస్తవముగ ఆపదలకు మూలము. సహసాకార్యకరణ మనఁగ, అవిమృశ్యకారిత్వమే. కావున అవిమృశ్యకారిత్వమే ఆపదలకు మూలము. కాని యీ అవిమృశ్యకారిత్వము, అవివేకమువలనఁ గలిగినదగుటచే,నవివేక మాపదలకు మూలమని చెప్పఁబడినది. అగుటచే శ్లోకమునొక్క మొదటివాక్యమున అవిమృశ్యకారిత్వమునకు ఆపదలకునుగల కార్యకారణభావము అన్వయముఖమున నున్నది. ఈ వాక్యార్థము వలననే, అవిమృశ్యకారిత్వము లేనపుడు, ఆపద లుండవు (అనఁగా సంపద లుండును) అను, వాక్యార్థము భాసించును. ఈ రెండవ వాక్యార్థమున, అవిమృశ్యకారిత్వమునకును, ఆపదలకునుఁ గల కార్యకారణభావము వ్యతిరేకముఖమున నున్నది. ఇట్లు మొదటివాక్యమున నన్వయముఖమున నున్న యర్థమే, రెండవ వాక్యమున వ్యతిరేకముఖమున ప్రతిపాదితమైనదని తెలియుచున్నది. అపుడు మొదటి వాక్యములో గతార్థ మగుటచే, రెండవ వాక్యము పునరుక్తమే.

ఈ విషయమే యీ వాక్యార్థమున నిరూపిత మైనది.

సాధర్మ్యేణాపిప్రయోగేఽర్థాత్ వైధర్మ్యేణాన్వయగతిః.అసతి తస్మిన్, సామ్యభావే హేత్వభావస్య అసిద్ధేః ఇతి నావశ్యం వాచ్యద్వయ ప్రయోగః.

అర్థము:- ఒకవిషయము నొకవాక్యమున సాధర్మ్యముఖమునఁ జెప్పినపు డది వైధర్మ్యముఖముగఁ గూడఁ భాసించి తీరును. ఉదా॥ నీ ముఖదర్శనమున నామె ప్రసన్నయగును. చంద్రదర్శనమున కలువ వికసించును'- అనునపుడు ముఖచంద్రులకు సామ్యము సాధర్మ్య ముఖమున ప్రతిపాదితమైనది. దీనివలననే నీ ముఖదర్శనము లేనిచో ఆమె ప్రసన్నకాదు- అను నర్థముగూడ స్ఫురించుచునే యుండును. అట్లుస్ఫురింపనిచో, సామ్యాభావమువలన హేత్వభావము సిద్ధింపదు. అనఁగా ముఖచంద్రులకు సామ్యము లేనిచో ముఖచంద్రులు ప్రసాద వికాసములకు హేతువులు కారు- అను విషయము సిద్ధింపదు. ముఖ చంద్రులకు సామ్యమున్నపుడే, ముఖచంద్రులు ప్రసాద వికాసములకు హేతువు లగుదురు. అందుచే నొకే యర్థమును అన్వయ ముఖముగను వ్యతిరేకముఖముగను తెలుపనక్కఱలేదు. దీని సార మిది- అన్వయ వాక్యమువలన భాసించుఅర్థమే వ్యతిరేక వాక్యమువలనఁగూడఁ దెలి యును. అందుచే మొదటఁ దెలిపిన యర్థమును తెలుపుటకే వ్యతిరేక ముఖముగ నింకొక వాక్యమును ప్రయోగించుట పునరుక్తమేయగును.

ఇచట నింకొక విషయమునుగూడ గుర్తింపవలయును. ఏది యున్నపుడు దేనికి ప్రతీతి గలుగునో యది దానికి హేతువు కానేఱదు. 'అగ్నియున్నదిగాన పొగయున్నది' అను అన్వయ వాక్యార్థము సిద్ధించిన తరువాత "అగ్ని లేనిచో పొగ యుండ" దను వ్యతిరేక వాక్యార్థము భాసించును. ఇచట అన్వయవాక్యము యొక్క ఉనికి కారణము. వ్యతి రేక వాక్యార్థము దానికి కార్యమైనది. ఇదియే యుచితము కాని, "అగ్ని లేనిచో పొగయుండదు" అను వ్యతిరేక వాక్యార్థము "నిప్పు న్నదిగాన పొగయున్నది" అను అన్వయవాక్యమునకు హేతువు కానే రదు. హేతువేయగునేని హేతుహేతుమద్భావమే తలక్రిందులగును. కావున అన్వయ వ్యతిరేక వాక్యములకు పరస్పరము కార్యకారణ భావము లేదు.

ప్రస్తుతము "సహసా విదధీత" యను శ్లోకమున రెండవవాక్యమునందు "హి" (ఏలన?) అనుకారణవాచకశబ్దము ప్రయుక్తమైనది. అనఁగా వ్యతిరేక వాక్యార్థము అన్వయ వాక్యార్థమునకు హేతువుగ నిరూపితమైనది. అందుచే నిట "హి" శబ్ద మపార్థక మనియుఁ దెలియవలయును. అగుచో శ్లోకముయొక్క ద్వితీయార్థమునఁగూడ చారుత్వమేల భాసించుచున్నది ? అని యడుగవచ్చును- సమాధాన మిది.

సంపచ్ఛబ్దము స్త్రీ లింగము. "విమృశ్య కారిణమ్" అనునది పుంలింగము. గుణలుబ్ధత్వ మనునొక ధర్మవిశేషముగూడ నిందున్నది. ఈ లింగధర్మ విశేషములు వలన నాయికా నాయకస్ఫూర్తి కలుగుచున్నది. అందుచే నిట సమాసోక్త్యలంకార మున్నది. ఆ యలంకార ప్రయుక్తమే యిచటి చమత్కారము.

యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.

అర్థము:- ఓ అర్జునా, ఎప్పుడెపుడు ధర్మమునకు గ్లానియు అధర్మమున కభ్యుదయమును గల్గునో, అప్పుడపుడు నన్ను నేను సృజించుకొందును.

ధర్మాధర్మములు ఛాయాతాపములవంటివి. అందులో నొకటి హెచ్చుచో రెండవది అవశ్యము తగ్గితీరును. కావున దర్మమునకు గ్లాని కలిగినదని చెప్పినంత మాత్రముననే అధర్మమున కభ్యుదయము భాసించి తీరును. అయినను "అభ్యుత్థాన మధర్మస్య" అని ప్రయోగించుట పునరుక్తి దోషమునే కల్గించును.

ఇప్పటికిఁ దేలిన సారమిది. (సంగ్రహ శ్లోకముల యర్థము)

పౌనరుక్త్యము ద్వివిధము. (1) అర్థ గతము (2) శబ్ద గతము. అర్థసామ్యమువలన సిద్ధించిన యర్థమునే తిరిగి శబ్దముఖమునఁ జెప్పినచో నది యథార్థమైన పునరుక్తియగును. ఇది గౌణము. తాత్పర్యభేద

ముండుటవలన, నొకశబ్దము ద్విరుక్తమగుచో నది శాబ్దమైనపునరుక్తి. ఇది ముఖ్యము. ఇందు మొదటిది దూషణము- రెండవది భూషణము. ఈ శబ్దపునరుక్తినే శబ్దాలంకార నిపుణులు లాటానుప్రాస మనినారు. అది యుదాహృతమైనది. ప్రస్తుతము ఆర్థపునరుక్తిని వివరింతుము. ఈ దూషణమునకు, ప్రకృత్యర్థము, ప్రత్యయార్థము ప్రకృతి ప్రత్యయో భయార్థము, పదార్థము, వాక్యార్థము అనునవి విషయములు. అభిన్నమైన ప్రకృత్యాదుల యర్థమునే రెండు పర్యాయములు చెప్పినపుడు పునరుక్తమైన పదమును మొదట వదలివేయవలయును. బహువ్రీహి సమాసమున్నను దానిని కర్మధారయ సమాసమని తలంచి మత్వర్థీయ శబ్దప్రయోగముచేసినపుడు పునరుక్తత స్పష్టముగనే భాసించుచున్నది (ఉదా: బిసకిసలయచ్ఛేద పాథేయవన్తః) తద్ధిత ప్రత్యయము వలననే యొక యర్థము సిద్ధించినపుడు, ఆతద్ధితాన్తపద, మా తద్ధితార్థమునే తెల్పు మఱియొకపదముతో సమసింపదు. అట్లు సమసించినచో నాతద్ధితప్రత్యయము వ్యర్థమగును. (ఉదా: జాంబవపల్లవాని) విశేషణవశమున, విశేష్యమునం దుత్కృష్టతనో యపకృష్టతనోకవి వివక్షించినచో, నపుడు విశేషణోపాదానము యుక్తమే. కానిచో నది పునరుక్తమగును. (ఉదా: పాయాత్ సశీతకిరణాభరణోభవో వః) సామ్యమునుం దెలుపు "ఇవా"దిపదము నొకపర్యాయము మాత్రమేప్రయోగించినను,మిగిలిన వానికిసామర్థ్యమువలననేయుపమానత్వముగోచరించుచున్నచో,అపుడు ఇవాది శబ్దము ననేక పర్యాయములు ప్రయోగించుట పునరుక్తియే యగును. (ఉదా: "నిర్వ్యాయవిద్యా") అవ్యభిచారియగు కారకమును విశేషణ రహితముగ ప్రయోగించుట (పతితో శ్రుతిస్తైః) వలెనే అనుమితమగు నర్థమును తిరిగి చెప్పుటయు (రాహుస్త్రీస్తనయోః) పునరుక్తమే యగును

ఏది యెవరియొక్క ధర్మముతో నుపలక్షితమైనదో లేదా

ఎవరికి సంబంధించిన దానితో సన్నిహితమైయున్నదో, ఆ రెండవదానితో మొదటియర్థమునకు అర్థమగు రూపణమే చేయవలయును గాని, శాబ్దమగు రూపణము చేయుట దోషమగును. (1) అనురాగవత్యపి (2) ఆభోగినేత్రపరివర్తన) ప్రయుక్తాన్తర్గతములైన పదములతోనే ప్రతీతమగునర్థమును తెలుపుటకు తిరిగి పదప్రయోగము సేయుట పునరుక్తి (మదిరాదిరవపానవశ) ప్రధానుఁడగుకర్త, అతని క్రియయు రూఢములైనపుడు, సాధకతమాంగములు ఔచిత్యము వలననే యవగతములగును. అయినను వానిని వాచ్యముగ చెప్పుట పునరుక్తమగును. (కరకలిత నిశాత) పైనిఁ దెల్పిన దోషద్వయమును సామాన్యముగ సమాస విషయమున వర్తించును. లక్షణైక పరాయణులును, ప్రతీతి విముఖులు నగు కవులు దోషభూయిష్ఠములగు సమాసముల ననేకవిధములఁ జేసినారు. అందువలననే, సమాసము కవులకు పెద్ద నికషమని పెద్దలు చెప్పినారు. సమాసమునందుఁ గాని, వాక్యములయందుఁ గాని అసాధారణమగు విశేషణము నుపయోగించినపుడు తదవ్యభిచరితమగు విశేష్యము తప్పక ప్రతీతమగును. కావున నా విశేష్యమును ప్రయోగించుటయు పునరుక్తియే. (సంకల్ప కల్పితాం...)

ఒక పదార్థమున కొక స్వరూప మవ్యభిచరితముగ నున్నను, తత్స్వరూపమును, ప్రయోజనము లేకున్నను తెల్పుట పునరుక్తి యగును. (అయథార్థక్రియారంభైః ఏది దేనికి నియతమగుధర్మమో అధర్మమునకు ధర్మితో సమాసముచేయుట మంచిదిగాదు. ధర్మిని చెప్పినపుడు ధర్మ మవగత మగుచునేయుండుటచే ధర్మి ధర్మములకు సమాసము దోషావహము. (ద్విషద్వధూలోచన చన్ద్రశాస్త్ర) కరణప్రతీతి లేనిదే క్రియాప్రతీతి యుండదు. అనఁగా క్రియాప్రతీతి కరణ ప్రతీత్యవ్యభిచారిణి- త్యాగము, పాకము మొదలగుక్రియలను తెలుపునపుడు క్రియా శబ్దమువలననే కరణార్థమును ప్రతీతమగును. కావున కరణ

శబ్దమును తిరిగి ప్రయోగింపఁగూడదు (శోకక్రియా కరణస్య) ఏ పద
మును ప్రయోగించినను ప్రయోగింపకున్నను నర్థప్రతీతి సమానము
గనే యుండునో, ఆ పదమును కవి ప్రయోగింపరాదు. అది దోషము.
అన్వయవ్యతిరేక వాక్యములలో నొకటి మఱియొకదాని కాక్షేపక
ముగ నుండును. అయినను నన్వయ వ్యతిరేక వాక్యములను రెంటిని
ప్రయోగించుటయు వాక్యపునరుక్తి యగును. (సహసా విదధీత)

ఈ విధముగ పునరుక్తి దోషభేదములను దిఙ్మాత్రముగ నిట
నుదాహరించితిమి, ఆ దోషసమూహమును సమగ్రముగ నెవరు నిరూ
పింపఁ గలరు ?

(46-69 సంగ్రహ శ్లోకముల తాత్పర్యము సమాప్తము. శ్లోక
ములు గ్రంథాంతమున చూడనగును)

వాచ్యావచన దోషము :-

"కనక నికషస్నిగ్ధా విద్యుత్ ప్రియా న మ మోర్వశీ"

అర్థము:- కనకనికషస్నిగ్ధా=(ఒఱపిడి ఱాతిమీఁద) బంగారము
యొక్క గీతవలె మనోహరమైన, విద్యుత్=మెఱుపు; మమ, ప్రియా,
ఊర్వశీ, న=నా ప్రియురాలైన యూర్వశి కాదు.

విక్రమోర్వశీయ నాటకమున నూర్వశిని వెదకుచున్న పురూ
రవుని వాక్యము లీపద్యమున నున్నవి.

ఇంతకుఁ బూర్వము-

"నవజలధర స్సన్నద్ధోఽయం నదృప్త నిశాచరః
సురధను రిదం దూరాకృష్టం న నామ శరాసనమ్
అయమపి పటుర్ధారాసారః న బాణపరంపరా.

అని మూడుపాదము లున్నవి. దీని కర్థ మిది.

ఇది క్రొత్త కారుమేఘము-మదించిన రాక్షసుఁడు గాఁడు. ఇది
ఇంద్రధనుస్సు- లాగి ఎక్కుపెట్టిన విల్లు గాదు. ఇది వర్షము- బాణ
పరంపర గాదు.

ఇందు మొదట కారుమేఘమునుజూచి రాక్షసుఁడనిభ్రమించినాఁడు. ఇంద్రధనుస్సును,వర్షమును చూచి క్రమముగ విల్లనియు, బాణములనియు భ్రమించినాఁడు. తరువాత భ్రమ తొలఁగినది.యథార్థమును తెలిసికొనినాఁడు. యథార్థవస్తువును గుర్తించునపుడు ప్రతి వాక్యమునందును "అయం నవజలధరః" -"ఇదం సురధనుః"-"అయం ధారాసారః" అని నవజలధర సురధనుర్ధారా సారములను-ఇదమ్ శబ్దముచే పరామర్శించినాఁడు. నాల్గవ పాదమునందుమాత్రమిదంశబ్దము లేదు. ఇచటఁగూడ నుండవలసిన "ఇదం" శబ్దము లేకుండుటచే అవాచ్యవచనదోషము దొర్లినది.

మఱియొక యుదాహరణము :-

"కమల మనంభసి,కమలే కువలయే, తాని కనకలతికాయామ్
సా చ సుకుమారసుభగే త్యుత్పాతపరంపరా కేయమ్"

అర్థము: అనంభసి=నీరు లేనిచోట, కమలమ్=కమలము (ముఖము); కమలే=కమలమునందు, కువలయే=రెండు కలువలు (నేత్రములు) తాని=ఆకమలము, కలువలును, కనక లతికాయామ్=బంగారు తీఁగెయందు,సాచ=ఆ బంగారపు తీఁగ సుకుమార సుభగా=కోమలమైనది అందమైనది. ఇతి=ఈ విధముగ, ఉత్పాత పరంపరా కేయమ్=ఏమి అనర్థపరంపర!

ఇచట రెండవ పర్యాయము, కమల (కమలే) శబ్దమును ప్రయోగింపరాదు. తస్మిన్ అని సర్వనామముతో పరామర్శించినచో బాగుండెడిది. అట్లు సర్వనామముతోఁ జెప్పుటకు బదులుగ కమలమును స్వశబ్దముతోనే తెలుపుటవలన 'అవాచ్యవచన మను దోష మిచట నున్నది.

"తస్మింశ్చ కువలయే' అని యున్నచో బాగుండెడిది.

శ్లో॥ సర్వనామ పరామర్శవిషయే యోఽర్థవస్తుని
స్వశబ్ద వాచ్యతాదోషః సవాచ్యావచనాభిధః

(సంగ్రహశ్లోకము 70)

తా॥ సర్వానామముతోఁ దెలుపఁదగిన విషయమును స్వశబ్దముతోనే తెలుపుట యవాచ్యవచనదోష మగును.

శ్లో॥ ద్వయం గతం సంప్రతి శోచనీయతాం
సమాగమప్రార్థనయా కపాలినః

అర్థము :- ప్రస్తుతము, కపాలియొక్క సమాగమ ప్రార్థనచే ఇద్దఱు శోచనీయులై నారు. (చంద్రుఁడు, పార్వతి) ఇచట కపాలిశబ్దము వలననే యర్థము ప్రతీతమగును? కపాలి శబ్దమునకు కపాలముగలవాఁడని యౌగికార్థము, ప్రస్తుత మీ శబ్దము (1) ధర్మియగు శివుని కేవలము తెల్పునా?(2) కపాలసంబంధము వలనఁగలుగు గర్హితత్వమను ధర్మమును మాత్రమే తెల్పునా ? (3) లేక ధర్మము ధర్మి అను నుభయమును తెల్పునా ? ఇందు మొదటి పక్షమును పరిగ్రహింతుమేని, గర్హితత్వమను విశేషము భాసించుటకొఱకు, కపాలి శబ్దమును రెండవసారి గూడ ప్రయోగింపవలయును.

లేకున్నచో గర్హితత్వమను ధర్మముభాసింపదు. రెండవపక్షము నాశ్రయింతుమేని, గర్హితత్వమున కాశ్రయుఁడైన శివుఁడు భాసించుట కొఱకు తిరిగి ఆ కపాలిశబ్దమునో, తత్పర్యాయ శబ్దమునో, సర్వనామ శబ్దమునో యుపయోగించి విశేష్యము నవశ్యము భాసింపఁ జేయవలయును. అపుడు గర్హితత్వ మనునది వివక్షితార్థసిద్ధికార్థమగు హేతువుగ నుపయోగించును. ఇటువంటి విషయమున, మొదట నుపయోగించిన శబ్దమునే రెండవ పర్యాయము గూడ నుపయోగించుట కుదాహరణముగ నీ క్రింది శ్లోకము చూడనగును.

శ్లో॥ సతత మనంగో౽నంగో నవేత్తిపర దేహదాహదుఃఖమహో
యదయ మదయం దహతి మామనలశరో ధ్రువ మసౌ
న కుసుమశరః

అర్థము:-అనంగుఁడైన యనంగునకు పరదేహ దాహదుఃఖము తెలియదు. దయనుమాలి యితఁడనవరతమును నన్ను దహించుచునే యున్నాఁడు-ఇతఁడనలశరుఁడే.కుసుమశరుఁడు గాఁడు-ఇచట "అనంగ" శబ్దమే రెండుమా ర్లుపయోగింపఁబడినది.

పర్యాయ వాచకమగు శబ్దము నుపయోగించుట కుదాహృతి.

"కుర్యాం హరస్యాపి పినాకపాణేః
ధైర్యచ్యుతిం కే మమ ధన్వినో౽న్యే"

అర్థము:- పినాకపాణియైన హరునకైనను ధైర్యచ్యుతిని కలుగ జేయఁగలను. ఏ ధనుర్ధరులు నా కెదురుగ నిలువఁగలరు ?

ఇచట "హరస్య" అనుపర్యాయశబ్దముచే "పినాకపాణి" యను శబ్దముయొక్కయర్థము ప్రతిపాదితము. ధైర్యచ్యుతినిచేయుట శక్యము గాని పని యని నిరూపించుటకు పినాకపాణిత్వ మార్థమగు హేతువుగ నుపకరించును. పినాకమను ధనుస్సు చేతియందుఁగలవాఁడగుటవలననే హరునిజయించుట శక్యముకాని పని యను విషయ మిందువలనఁ దెలి యును. పినాకపాణి శబ్దప్రయోగము వలన నీ ప్రయోజనము సిద్ధింప నిచో నిచట "హర" శబ్దప్రయోగము పునరుక్తమే యయ్యెడిది.

ఏకః శంకా మహికులరిపోః అత్యజత్ వైనతేయాత్.

అర్థము :- సర్పములకు శత్రువైన వైనతేయునివలన భయ మును త్యజించెను.

ఇచట వైనతేయ, అహికులరిపు పదములు రెండును గరుత్మం తుని మాత్రమే తెల్పును. కాని 'సర్పకుల శత్రు' వను నర్థము గల 'అహికులరిపు' పదము, వైనతేయునకు భయపడ కుండుట కష్టమను

విషయమును నిరూపించుటకు హేతువుగ నుపయోగించుటచే పునరుక్త దోషము కలుగదు.

సర్వనామముతో పరామర్శించుట కుదాహరణము :-

"దృశా దగ్ధం మనసిజం జీవయన్తి దృశైవ యాః
విరూపాక్షస్య జయినీ స్తాస్తుమో వామలోచనా:"

అర్థము:- చూపుతో దగ్ధమైన మనసిజుని, చూపుతోనే వామలోచనలైన యెవరు బ్రతికింతురో, ఈశ్వరుని జయించిన యాస్త్రీలను స్తోత్రము చేయుచున్నాము.

ఇచట వామలోచన లనుపదము 'యాః' అను సర్వనామపదముచే పరామృష్టమైనది. చూపుతో దహించుట,చూపుతో బ్రతికింపఁ జేయుటయనున వన్యోన్యవిభిన్నములు. అయినను, ఆ రెంటికిని 'చూపు' నున దొకటియే హేతువైనది. అట్లగుటకు హేతువు స్త్రీల "వామలోచనాత్వమే" "వామలోచనాత్వాత్" అను పంచమీవిభక్త్యంత పదము లేకున్నను, ప్రథమావిభక్తియందున్న పదమే హేతువగుటచే, నిచట వామలోచనా: అను పదము అర్థమగు హేతు వగుచున్నది. కావున పునరుక్తిదోషము లేదు.

ఇప్పటికి మొదట రెండుపక్షములును కుదరవని తేలినది. అందువలననే మూఁడవపక్షముసైతము పొసగదు. ఆవృత్తిలేనిదే ఒకేశబ్దమర్థద్వయమును జెప్పలేదుగదా! తగినకారణములేనిదే యావృత్తిచేయుట యెట్లు? ప్రస్తుతముకపాలిపదము నావృత్తిచేయుటకుఁ దగినకారణము లేదు. అందుచే నిచట నవాచ్యవచనదోష మున్న దనవలెను.

"ద్వయం గతం సంప్రతి తస్య శోచ్యతాం
సమాగమ ప్రార్థనయా కపాలిన:"

అని పాఠ మున్నచో బాగుండెడిది. ఇందును "తస్య" యను పదము "కపాలి" పదముకంటె ముందుగ నుపాత్తమైనది. పరామర్శని

యార్థమును ముందుచెప్పి, దానిని సర్వనామముతో పరామర్శించుట యుక్తమైన పద్ధతి. ఇందీ క్రమము వ్యత్యస్తమైనది. లేదా తస్య అను పదము "కపాలి"పదముకంటె దూరముగఁగూడ నున్నది. ఈవిధముగ నేదియో యొకదోష మిందునున్నను, నీదోష మవాచ్యవచన దోషముకంటె నల్పమైన దగుటచే నీ పాఠమును గ్రహింపనగును.

ప్రశ్న :- కపాలిశబ్దము నావృత్తి సేయుటకుఁ దగిన హేతువు లేదని మీరనినారు అది యుక్తముగాదు. కపాలిశబ్దము వలన, సంజ్ఞియగుశివుఁడు, తద్గతధర్మము నను రెండర్థములును ప్రతీతములుకావలయును. అవి రెండును వివక్షితములు. రెండర్థములును భాసింపవలయుననిన శబ్దము నావృత్తిసేయవలయును. కావున నర్థద్వయ వివక్షయే శబ్దావృత్తికి నిబంధనమని యేలయనరాదు? శబ్దమునావృత్తిసేయుచో రెండు శబ్దములవలన రెండర్థములును భాసించునుగదా! అపుడు దోషమేమి ?

సమాధానము :- ఒక శబ్దమునే రెండుపర్యాయము లుపయోగించుట నావృత్తియందురు. అర్థభేద ముండుటచే నావృత్తములైన శబ్దములకుఁగూడ భేద ముండుననుమాట సత్యమే. అయినను నావృత్తి యనునది, శబ్దసాదృశ్య మాత్రజన్యము. శబ్దసాదృశ్యము వలన, నా శబ్దములు రెండును నొకటియే యను భ్రమ కలుగును. ఆ భ్రమ యున్నంతవఱకును శబ్దద్వయ ప్రతీతిగాని, అర్థద్వయ ప్రతీతిగాని కలుగదు. అందుచే శబ్దావృత్తివలన నేమియు నుపయోగములేదు. కావున ధర్మి, ధర్మము నను రెండర్థములును, భాసింపవలయు నన్నచో, నొక పర్యాయము ప్రయోగించిన శబ్దమునే రెండవ పర్యాయము కూడ ప్రయోగింపవలయును. లేదా మొకటి శబ్దమునకు సమానార్థకమగు మఱియొక శబ్దమునుగూడ ప్రయోగింపవలయును. ఇవి రెండును కాని పక్షమున సర్వనామ శబ్దము నైనను ప్రయోగించి మొదటనున్న

శబ్దార్థమును పరామర్శింపవలయును. ఈ విషయమే ఈ యనన్తర శ్లోక ములలోఁ దెలుపఁబడినది.

"అర్థభేదా ద్విభిన్నేఽపి శబ్దసాదృశ్య మాత్రజః
ఆవృత్తి వ్యవహారోఽయం మూలమస్యైకశాఖిమః"
అతశ్చ తత్పర్యాయేణ తేనైవ సర్వనామ్నావినిర్దిశేత్
అర్థహేతుత్వ నిష్పత్త్యై ధర్మిధర్మోభయాత్మకమ్.

ఇట్లు రెండు శబ్దములను విడిగా నుపయోగించినపు డందొక శబ్దము యొక్క యర్థము హేతుసూచకముగ నుండును. కావున శబ్ద ద్వయ ప్రయోగమే యిటువంటి విషయమున నవశ్య కర్తవ్యమని తెలియవలయును.

ఒక యలంకారమునకు విషయమైన తావున వేఱొక యలంకా రమును గూర్చుటయు వాచ్యావచనదోషమే యగును.

సమాసోక్త్యలంకారమునకు విషయమైన తావున శ్లేషోపనిబద్ధ మున కీ క్రింది యుదాహరణము చూడనగును.

"అలకాలికులాకీర్ణమా రక్తచ్ఛద సుందరమ్
ఆమోదకర్ణికా కాన్తమ్ భాతి తేఽబ్జ మివాననమ్"

అర్థము:- (1) అలకాలికులాకీర్ణమ్=ముంగురు లనెడు, తుమ్మె దలచేత వ్యాప్తమైనట్టియు, ఆ రక్తచ్ఛద సుందరమ్=ఎఱుపుగ నున్న పెదవులచే సుందరముగ నున్నట్టియు, ఆమోద కర్ణికాకాన్తమ్=పరిమ ళముగల కర్ణాలంకారములచే (ఆమోదమును కలుగఁజేయు కర్ణభూష ణములచే) మనోహరముగ నున్నట్టియు తే, ఆననమ్=నీ ముఖము, అలకాలికులాకీర్ణమ్=ముంగురులవంటి తుమ్మెదలచే వ్యాప్తమైనట్టియు, ఆరక్తచ్ఛద సుందరమ్=ఎఱ్ఱని రేకులతో నందమైనట్టియు, ఆమోది కర్ణికా కాన్తమ్=పరిమళముగల కర్ణికచే (బొడ్డుచే) మనోహరముగ నున్నట్టియు, అబ్జమివ=పద్మమువలె, భాతి=ప్రకాశించుచున్నది.

ఇందు ప్రస్తుతమైన యానసమున కుపయుక్తములైన విశేషణము లన్నియు అప్రస్తుతమగు నబ్జమునకును నుచితములే. విశేషణ సామర్థ్యమువలన నప్రస్తుతమగు నబ్జ మాక్షిప్తమగును. అందుచే నిట సమాసోక్త్యలంకారము భాసించును. ఈయలంకారమువలననే, యానసమునకును, నబ్జమునకును నౌపమ్య మనుమేయ మగును. అబ్జ పదము నుపయోగించినప్పుడు, శ్లేషవలన నుపమాలంకారము భాసించును. అపుడు సమవాచ్య మగును. కాని, యీ యుపమాలంకారమిట, సమాసోక్తి వలన ననుమేయ మైనపుడే, సచేతనచమత్కారకారియగును గాని, శ్లేషవలన వాచ్యమైనపు డంత చమత్కారమును కలుగఁ జేయదు. ఇట్లు సమాసోక్తికి విషయమైన తావున, శ్లేషను గూర్చుట దోష మని తేలినది.

వేఱొక యుదాహరణము.

"భంహీయాంసో, గరీయాంసః, స్థవీయాంసో, గుణా స్తవ
గుణా, ఇవ నిబధ్నన్తి, కస్యనామ న మానసమ్"

అర్థము:- బహుళతరములు, గురుతరములు, స్థూలతరములునగు నీగుణములు (గుణములవలె) రజ్జువులవలె నెవని మనసును బంధింపవు ? (ఆకర్షింపవు ?)

ఇచట, "నిబధ్నన్తి" యను పదమునకు ముఖ్యమైన యర్థము "బంధించుట". ఈ బంధించుట యనునది అప్రస్తుతమగు రజ్జువు (తాడు) యొక్క కార్యము. కాని యిది శౌర్యాది గుణములయం దారోపితమైనది. ఈ నిబంధన పదసామర్థ్యమువలననే, శౌర్యాదిగుణములకు రజ్జు సాదృశ్యము భాసించును. సమాసోక్త్యలంకారమును స్ఫురించును. ఇట్లు సమాసోక్తి వలననే, గుణములకు రజ్జుసామ్య మనుమీయమాన మగుచుండ, "గుణా ఇవ" అని యుపమాన వాచకపదమును, సాదృశ్య వాచకపదమును బ్రయోగించుట దోషావహము.

ఇదియును సమాసోక్త్యలంకారమునకే విషయము. శ్లేషకుఁ గాదు.

ప్రశ్న:- ప్రస్తుతార్థేన వాక్యేన తత్సమానై ర్విశేషణైః
అప్రస్తుతార్థక థనం సమాసోక్తి రుదాహృతా.

"ప్రస్తుతవిషయమునకు సంబంధించిన వాక్యముతో, తత్సమా నములగు విశేషణములతో నప్రస్తుతార్థకథనము సమాసోక్తియగును. ఇది గదా సమాసోక్త్యలంకార లక్షణము ! దీనివలన, విశేషణ సామ్యమువలననే యప్రస్తుతార్థస్ఫురణ మున్నచో సమాసోక్తి యని తెలియుచున్నది. ప్రస్తుతము నిబంధన క్రియ నాధారముగఁ జేసికొని సమాసోక్తిని జెప్పుచున్నారు. ఈ నిబంధనము విశేషణము కాదు గదా! అగుచో నిట సమాసోక్తి యెట్లు పొసగును ?

సమాధానము:- విశేషణసామ్య మొకటియే అప్రస్తుతార్థావ గతికి హేతువైనపుడు సమాసోక్తియనుట సరియైనదిగాదు. అప్రస్తుత కార్యసమారోపముగూడ, సమాసోక్తికి హేతువే యగును. అందుచే నిచట "గుణా ఇవ" అను పదములను దొలగించుట మంచిది.

శ్లేషవిషయమున నుపమాలంకార ప్రయోగమున కుదాహృతి.

"భైరవాచార్యస్తు దూరాదేవ దృష్ట్వా రాజానం
శశినమివ జలనిధి శ్చచాల"

అర్థము:- భైరవాచార్యుఁడు దూరమునుండియే రాజును జూచి చంద్రుని జూచిన జలనిధివలె నుప్పొంగెను.

ఇచట రాజశబ్దమునకే రాజు,చంద్రుఁడు నను రెండర్థములును గలవు. అందుచే "శశి" శబ్దమును ప్రత్యేకముగ ప్రయోగింపనక్కఱ లేదు. శ్లేషనుండియే యుపమాలంకారము భాసించును. అందుచే 'శశి' పదమునుతొలగించి 'దూరాదేవ దృష్ట్వా రాజానం జలనిధిరివ చచాల' అని ప్రయోగింపవలయును. ఇపు డర్థబలమువలన నుపమ భాసించును. శాబ్దమగు నుపమ కంటె నార్థమగు నుపమయే యెక్కువగ హృద

యమునాకర్షించును. ఈ క్రింది విషయమునఁగూడ నిటులే జరిగినదని తెలియవలెను.

"తదన్వయే శుద్ధిమతి ప్రసూతః శుద్ధిమత్తరః
దిలీప ఇతి రాజేన్దు రిన్దుః క్షీరనిధావివ"

అర్థము:- పవిత్రమైన యా వంశమునందు, పవిత్రతముఁడైన దిలీపుఁడను రాజచంద్రుఁడు, క్షీరసముద్రమునందు చంద్రుఁడు వలెఁ బుట్టెను.

ఇచట: రాజచంద్రుఁడనునపుడు రాజనెడు చంద్రుఁడని యర్థము చెప్పుటచే రూపకాలంకారము. చంద్రుఁడువలె ననుటచే నుపమాలంకారమును, నుపనిబద్ధములైనవి. ఇట ఆ యన్వయమునందు (లేక అన్వయాబ్ధియందు) దిలీపుఁడను రాజుదయించినాఁడు'-అని మాత్రమే చెప్పవచ్చును.

రాజ శబ్దమునకు రాజు, చంద్రుఁడు నను రెండర్థము లుండుటచే, శ్లేషమహిమవలననే రాజ చంద్రులకుఁగల రూపకము ప్రతీయమానమగును. ఇట్లు, శ్లేషవలననే లక్ష్యము సిద్ధించుచుండ నా శ్లేషను లెక్క సేయక, కవి రూపకము నుపనిబంధించినాఁడు. ఈ రూపకము వలన, రాజ చంద్రులకుఁ గల సాదృశ్యము ప్రతీయమాన మగును. కాని యింతతో సంతృప్తి నొందక, ఉపమారాగి యగు కాళిదాస మహాకవి "ఇందుః క్షీరనిధావివ" అని, ఉపమాలంకారమును గూడ నిచటఁ గూర్చినాఁడు. కాని యా యుపమ, శ్లేష రూపకములతోఁ బోటీపడలేదు. ఉపమయందు కంటె రూపకమునందు ప్రతీయమానార్థ సంస్పర్శ మధికముగ నుండును. రూపకమందుకంటె శ్లేషయందింకను నధికముగ ప్రతీయమానార్థ సంస్పర్శ ముండును. ఈ క్రమము ననుసరించి, శ్లేష రూపకోపమలలో పూర్వాపూర్వము ప్రతీయమానార్థ సంస్పర్శ మధికముగ నుంటచే, సహృదయైక సంవేద్యమగు చమత్కా-

రము గూడ పూర్వపూర్వమే యధికముగ భాసించును. కావున శ్లేషను వదలి యిచట నుపమాలంకారమును గూర్చుట యవాచ్య వచనమైనది.

రూపక విషయమున నుపమాలంకార ప్రయోగము.

"తతోఽభ్యుదితం వైరమనాభిలిప్తః
సోఽలీవ రమ్యాత్ భవనాద్రికుంజాత్
వినిర్యయౌ దానవగన్ధహస్తి
మహాద్రికుంజాదివ గంధహస్తీ"

అర్థము:- వైరమనెడు మదముచే నభిషిక్తుడగు నా దానవుడనెడు గన్ధగజము రమ్యమైన భవనమనెడు, పర్వతకుంజము నుండి, మహాద్రికుంజమునుండి, గన్ధగజము వెలువడిన రీతిని వెలువడెను.

ఇచట "దానవ గన్ధహస్తి", "భవనాద్రి కుంజాత్" అను రూపకముల వలననె, దానవగన్ధ గజములకును, భవనాద్రి కుంజములకునుగల సామ్యము ప్రతీయమాన మగుచుండ, "మహాద్రి కుంజాదివ గన్ధహస్తీ" అని యుపమాలంకారమును కూర్చుట యవాచ్య వచన దోషమునకు తావిచ్చినది.

ప్రశ్న :- "రాజేన్దుః", "దానవ గన్ధహస్తీ"- అను పదములలో, ఇన్దు, హస్తి, పదములు ప్రశంసావాచకములు. తరువాతవచ్చు ఇందు, హస్తి పదములు, చంద్ర గజవాచకములు. అనగా నుపమాన వాచకములు. ఇట్లా పదములు భిన్నార్థకము లగుటచే, ఖీా రనిన యవాచ్య వచనదోషమునకుఁ దావులేదే?

సమాధానము:- పైవానిలో మొదటిపదములకే యా రెండర్థములను జెప్పుకొనవచ్చును గదా! అపుడు రెండవమా ఱుప యోగించిన పదములు వ్యర్థములే గదా!

ప్రశ్న: అగుచో నీక్రింది కావ్యమును చూడుడు.

"అనిరాకృతతాపసంపదం ఫలహీనాం సుమనోభిరుజ్ఝితాం
ఖలతాం ఖలతామివాసతీం ప్రతిపద్యేత కథం బుధో జనః

అర్థము :- అనిరాకృతతాపసంపదం=పోఁగొట్టని దుఃఖసము దాయము కలిగినట్టియు (తాప=దుఃఖము), ఫలహీనాం=నిష్ఫలమైన ట్టియు, (లాభము లేనట్టియు), సుమనోభిః=విద్వాంసులచే, ఉజ్ఝితామ్=వదలివేయఁబడినట్టియు, అసతీం=దుష్టమైన, ఖలతామ్=దుర్జనత్వమును-

అనిరాకృత తాపసంపదమ్=తొలఁగించని యెండ కలిగినట్టియు, (తాప=ఎండ), ఫలహీనాం=ఫలములు లేనట్టియు, సుమనోభిరుజ్ఝితామ్=పుష్పములు లేనట్టియు, అసతీం=లేనట్టియు (లేక అశోభనమైనట్టియు), ఖలతామివ=ఆకాశలతనువలె (లేక ధాన్యాది క్షోదనస్థానమును వలె, బుధో, జనః=పండితుఁడైనవాఁడు, కథం, సేవేత=ఎట్లు సేవించును ?

ఇచట శ్లేష విషయమున నుపమ యుపయుక్తమైనది. అవాచ్య వచనదోషము కలిగినది. ఇది అసత్ కావ్యమైనది. అని యనవచ్చునా?

సమాధానము:—అనఁగూడదు. ఏ యలంకారప్రతీతి కనుగుణ మగు శబ్దరచనచే శ్లేషసిద్ధి కలుగునో యచట నా మొదటి యలంకారము శ్లేషాభివ్యక్తి కుపకరించునే గాని, దాని స్థానము నాక్రమింపదు. ప్రస్తుతము వేఱొక యలంకారము నుపనిబంధింపవలయు నను సంకల్పము లేదు.

అయినను, ఒక పర్యాయము ప్రయోగించిన ఖలతా శబ్దమునే రెండవ పర్యాయము, ఉపమాన ప్రతీతి కొఱకు ప్రయోగించినాఁడు. ఈ యుపమ శ్లేష కుపకరించునే గాని, యలంకారాన్తర స్పర్శ మిట లేదు. కావున నిచట యుపమ, శ్లేషవిషయమున నుపయుక్తమైనదా లేదా యను శంకయే యుపతరింపదు. ఇఁక విశేషణములు, నియమితముగ నీ

యుపమానమునకే వర్తించుననుటకు వీలులేకుండుటచే,సమాసోక్త్యలంకారము గూడ భాసింపదు. కావున సమాసోక్తి విషయమున నిచట శ్లేషను గూర్చినా రనుటయుఁ బొసగదు. ఇట్లు,పూర్వము సూచితమైన దోషద్వయమునకును నిందు సంబంధమే లేదు. అట్టిచో నీ కావ్యము దుష్ట మనుట యెట్లు ?

పైని నిరూపించిన విషయము యొక్క సార మిది.

ఏ యలంకారముల (శ్లేషోప మాదుల) యభివ్యక్తికై, యే శబ్దములు (అబ్జమివ-మొదలగునవి) ప్రయుక్తము లగుచున్నవో, యా యలంకారముల కంటె నితరమగు నలంకారము గూడ (సమాసోక్తి) నా శబ్దములు లేకున్నను వ్యక్త మగుచో లాఘవ మగుటచే నపు డాశబ్దములు లేకుండుటయే మంచిది. శోభను గూర్చుటయే యలంకారములయొక్క ప్రయోజనము. ఆ ప్రయోజమును సాధించుటలో నొక యలంకారము గొప్పదని కాని, మఱియొకటి తక్కువదని కాని భేదము లేదు. అందుచే కవు లొక దానిని నిషేధింపరు. మఱియొక దానిని విధింపరు. లాఘవగౌరవముల ననుసరించియే యలంకారముల నెన్నుకొందురు.

(73-74 శ్లోకములు)

అర్థముయొక్క సౌందర్యాతిశయ నిష్పత్తికొఱకయియే, కవి, కావ్యక్రియ నారంభించును. అలంకారములు, భంగిభణితి విశేషరూపము లేయగుటచేతను, సౌందర్యాతిశయసిద్ధి నాంతరీయకమగుటవలనను, వాని (అలంకారములు) నిష్పత్తి కొఱకు కావ్యము నారంభింపఁడు. ప్రస్తుతము సమాసోక్తి శ్లేషలవలననే,యభీష్టమైన చమత్కారము సిద్ధించుచున్నది. కాని, యుపమాలంకారముచే సిద్ధించుట లేదు. కావున సౌందర్యాతిశయ సిద్ధికై వాచ్యములైన శ్లేష సమాసోక్తులను వాచ్యములుగఁ జేయకుండుట యవాచ్య వచనదోషమగును.

రసబంధోద్యతుఁడగు కవి, అలంకార విన్యాసమునకు యత్ని
పఁడు. అలంకారములు రససిద్ధికి నాంతరీయకములే.

ఏలన, సాతిశయోక్తిప్రాదకము లగుటచే, విభావాదులు రసమున
కంగములు. ఆవిభావాది వైచిత్ర్యోక్తిశరీరములే యగుటచే నలంకా
రములు (విభావాది ముఖమున) రసాశ్రయములే. (76) ఇట్లలంకా
రము లపృథానములగుటచే, కవి, అలంకారరచనము సేయుట, సేయ
కుండుట యనునవి, యర్థముయొక్క చారుత్వము నపేక్షించియుండును.
(77)

పూర్వులు గూడ నిట్లే చెప్పినారు.

"ముఖ్యా మహాకవిగిరా మలంకృతిభృతామపి
ప్రతీయమానచ్ఛాయైవ భూషా లజ్జేవ యోషితాం"

తాత్పర్యము:- స్త్రీలకు లజ్జవలె, సాలంకారములగు మహాకవి
వాక్యములకుఁ గూడ ప్రతీయమాన చ్ఛాయయే ముఖ్యమైన భూష
ణము.

అందువలననే, యలంకారము లనేకములున్నను, శక్తిమంతుఁ
డగు కవిసైతము కొన్నియలంకారములనే నిబంధించును. (78) ఏలన
యలంకారములన్నిటికిని యుపమయే ప్రాణము. (జీవితాయమానము)
అది, ప్రతీయమానమైనపుడే తద్విదుల కధికముగ రుచించును. తత్వా
ర్థదర్శు లగువారు రూపకాద్యలంకార వర్గము, యమకమును, తత్ప
పంచముకొఱకే (రసప్రతీతి కొఱకే) యని చెప్పినారు. (80)

శ్లేష, రెండు విధములు (1) శబ్దశ్లేష, (2) అర్థశ్లేష- అందు
శబ్దశ్లేషను విషయము నీ క్రిందఁ దెల్పుచున్నాము.

(శ్లేషము)

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

Printed by J. Gopalam, B.A., L.T., at Republic Press, Kakinada

Edited by **C. PAPAIAHSASTRY**

Published by Andhra Sahitya Parishat, Kakinada.